జాతీయ జీవిత గ్రంథమాల

# హర్షుడు

మూలం

వి. డి. గంగల్

అనువాదం

ఆర్. రాఘవరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ 1971 (శక 1892)
ద్వితీయ ముద్రణ 1991 (శక 1913)



రూ. 10-00

HARSHA *(Telugu)*

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా,
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ-110 016 చే ప్రచురింపబడినది.

# విషయసూచిక

# I

## ప్రస్తావన

"ఏతేన ఖలు రాజన్వతీ పృథ్వీ" 'నిక్కముగ నితడే ఉర్వినలరారిన మహారాజు.' సుప్రసిద్ధ సంస్కృతకవి, చరిత్రకారుడు అయిన బాణుడు, భరతమాత మేటి పుత్రులలో నొకడైన హర్షచక్రవర్తి కర్పించిన శ్రద్ధాంజలి ఇది. భారతదేశ ప్రాచీన చరిత్ర ఇంచుమించుగ మరుగుపడి యున్నదనియే చెప్పవచ్చును. నాటి స్థితిగతులను, సంఘటనలను వివరముగ తెలుపు ప్రామాణిక గ్రంథము లేవియు లభ్యపడక పోవుటయే దీనికి మూలకారణము. కాని హర్షుని గూర్చి యట్లుగాదు. 'హర్షుని రాజత్వము అత్యద్భుతము, దేవతాతీతము కూడా' అని బాణుడు కొనియాడెను. అదృష్టవశమున హర్షుని కాలము నాటి పరిస్థితులను వివరముగ తెలుపు చారిత్రిక సామగ్రి మనకు వలసినంతగ లభించుచున్నది. పైన చెప్పినట్లు, బాణుని ప్రసిద్ధ గ్రంథమగు, 'హర్షచరిత' మే దీనికి తొలి ఆధారము. విశిష్టరమణీయమైన శైలిలో బాణుడు రచించిన, ఈ హర్షచరితము అనేక విషయములను వివరించును. హర్షుడు ప్రభాకరవర్ధనుని రెండవ కుమారుడు. అందుచేత అతడు సంభావిత వారసుడే అయినను, అతడెట్లు సింహాసనము నధిష్ఠించెనో, తన సోదరుని హత్యగావించిన వారిపైనను, తన సోదరిని అవమానించిన వారిపైనను ఏ విధముగ పగసాధించెనో ఈ గ్రంథము విపులముగ వివరించెను. అంతేగాక, హర్షుని దిగ్విజయ యాత్రాప్రాభవము క్రమ క్రమముగ ఉత్తర హిందూ దేశమంతటను (నేటి గుజరాతుతో సహా) ఏ విధముగా వ్యాప్తి చెందెనో కూడ ఇది విశదీకరించెను. నేపాలుతో సహా ఉత్తరమున

కాశ్మీరమునుంచి దక్షిణమున నర్మదా తీరమువరకు, తూర్పున అస్సామ్‌నుంచి పశ్చిమమున జలంధర్ వరకు హర్షుని ప్రాభవము ప్రబలెను. అయినను, నేరుగ హర్షునిపాలన క్రిందనున్న ప్రాంతములు, తూర్పు పంజాబు, యావత్తు సంయుక్త ప్రాంతము, బీహారు, మధ్యప్రదేశ్, ఒరిస్సాలోని కొంత భాగము మాత్రమే. పశ్చిమ బెంగాలులోని కొంత ప్రదేశము కూడా అతని విశాల సామ్రాజ్యములో చేరియుండెను. హర్షుడు చాలకాలమువరకు, దాదాపు 41 సంవత్సరములు పరిపాలించెను.

దురదృష్టవశమున బాణుని హర్షచరిత్ర సంపూర్ణముగా లేదు. అతడు ఎనిమిది అధ్యాయములు మాత్రమే వ్రాసెను. హర్షుని కీర్తి, ప్రతిష్ఠలు మహోన్నత స్థితిలో నున్నప్పుడు, ఆకస్మికముగ నీ రచన ముగియుట ఎంతయేని విచారకరము. హర్షుడాసరికి తన సోదరి రాజ్యశ్రీని కాపాడుకొననే కాని, గౌడరాజును సర్వ నాశనము చేయుదునన్న తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనలేదు. బాణుడు ఈ విధముగ తన గ్రంథమును ముగింతునని తలచి యుండక పోవచ్చును. ఎందువల్లనోగాని, అతడీ గ్రంథమును అసంపూర్తిగ వదలివేసెను. ఈ మహా చక్రవర్తి సంపూర్ణ జీవిత చరిత్రను యథోచితముగ చిత్రించుటకు 'నూరు జన్మలైనను చాలవ'ని[1] బాణుడు తన అసమర్థతను తెలియపరచుచు తన సోదరులతో ప్రస్తావించెనని మూడవ అధ్యాయములో నొక సూచన కలదు. ఇది కేవలము బాణుని వినయ వాక్యములే. ఇదే విధముగ పరిచయ పద్యములలో తన విధేయతను ప్రకటించుచు బాణుడిట్లు నుడివెను. 'ఈ మహనీయుని గాథను చిత్రించబూనుట సాగర మధ్యమున నురుకుటయే.' 'కరోమ్యాఖ్యాయికాంబోధౌ జిహ్వా పవన చాపలం.' రాజు యెడల అతనికున్న శ్రద్ధాభక్తులే

---

1 కః ఖలు పురుషాయుషశతేనాపి శక్నుయాదవికలమస్య చరితం వర్ణయితుం.

దీనికి కారణము. బాణుడు హృదయ పూర్వకముగ నీ గ్రంథము నిట్లు అసంపూర్తిగ వదిలివేసె ననుటకు అంతరంగ సాక్ష్యము లేవియు కానరావు. బాణుని మరియొక గ్రంథము - కాదంబరి కూడ అసంపూర్ణమైనటువంటిదే. బాణుని మరణాంతరము అతని కుమారుడు భూషణ బాణుడు దానిని పూర్తిచేసెను.

హర్షుని గూర్చి వివరముగ తెలిసికొన దలచిన మనకు మరొక సామగ్రికూడా లభించుచున్నది. క్రీ. శ. ఏడవ శతాబ్దంలో, చైనా దేశమునుండి, 'యువాన్ చ్వాంగ్' అను బౌద్ధ యాత్రికుడు భారతదేశమునకు వచ్చెను. ఈ యాత్రికుని పేరు వేర్వేరు పండితులు వేర్వేరుగ నుచ్చరింతురు – కొందరు హువాన్‌ధ్సాంగ్ అనియు, కొందరు హూన్‌త్సాంగ్ యనియు. కాని, 'యూన్ చ్వాంగ్' అనునదియే చైనా పదమునకు సరియైన ఆంగ్లభాషాంతరీకరణము. నలుగురు అన్నదమ్ములలో యూన్‌చ్వాంగ్ అందరి కంటె చిన్నవాడు. అతడు గొప్ప పండితుడు, వేదాంతి. చైనా దేశములలో గొప్ప పేరు ప్రతిష్ఠలు కలవాడు. ప్రసిద్ధ 'చెన్‌హ్యూ' కుటుంబములో జన్మించెను. ఈ కుటుంబము రాజవంశమునకు చెందినది. ఇతడు బాల్యమునుండియే బౌద్ధ ధర్మాభ్యాసనము చేసిన జ్ఞానపిపాసి. ప్రయాణ సౌకర్యములు లేని ఆ కాలములో చైనా నుండి భారతదేశమునకు వచ్చి, 15 సంవత్సరములుండి అనేక వ్యయప్రయాసల కోర్చి దేశమంతట పర్యటించెను. హర్షుని ఆస్థానములో అతడు పెక్కు సంవత్సరములుండెను. 'షియూచీ' లేక 'సేయూకే' అను యాత్రా గ్రంథములో తన అనుభవము లన్నిటిని చక్కగ పొందుపరచెను. దీని పూర్తిపేరు 'తా-తాంగ్ -షి-యూ-చీ' అనగా 'తాంగ్ వైభవకాలమునాటి పశ్చిమ దేశపు వివరములు.' భారతదేశ ప్రాచీన చరిత్ర నభ్యసించు వారికి ఈ గ్రంథము చాల ఉపయోగ పడగలదు. ఇందు, ఏడవ శతాబ్దపునాటి భారతదేశ మత, రాజకీయ, సాంఘిక పరి

స్థితులన్నియు సమగ్రముగ చిత్రించపడినది. దీనికి అనేక సంస్కరణములు వెలుపడినవి. వీటిలో ఇతివృత్తములోనూ, విమర్శల లోనూ సహజముగ కొన్ని మార్పులు కానవచ్చుచున్నవి. హర్షుని యాస్థానములో యువాన్ చ్వాంగ్ ఇంతకాలముండుట సంతోషదాయకమైన సంఘటనయే. ఏలనన అతని గ్రంథములవల్లనే హర్షుని కాలమునాటి స్థితిగతులు సవిస్తరముగ తెలియుచున్నది.

అదృష్టవశాత్తు మరియొక కాకతాళీయమైన సంఘటన కలదు. పైజెప్పినట్లు, బాణుని హర్షచరిత, హర్షుని కీర్తి ఉచ్ఛస్థితిలో నున్నపుడు ఆకస్మికముగ సమాప్తి నొందెను. చారిత్రకముగ బాణుని గాథ క్రీ. శ. 612 వ సంవత్సరములో నంతమొందినది. అప్పటికి హర్షుడు భర్తను గోల్పోయిన తన సోదరి రాజ్యశ్రీని తిరిగి పొందగలిగెను. చాలకాలము తరువాత, అనగా క్రీ. శ. 630 లో యువాన్ చ్వాంగ్ భారతదేశమునకు వచ్చెను. కాని, అతని హర్షచరిత్రలో బాణుడు వదలివేసిన భాగము, తర్వాతి భాగము వివరింపబడి యున్నది.

ప్రఖ్యాతకవి బాణుడు హర్షుని జీవిత గాథను నెచ్చోట వదలి వేసెనో, నచటినుండి కథా సూత్రమును గ్రహించి, చారిత్రికులకు నుపయోగపడునట్లు, యువాన్ చ్వాంగ్ ద్వారా హర్షుని జీవిత చరిత్ర సమగ్రముగ వివరింపబడుట నిజముగ విధి విధానమనియే చెప్పవలయును. ఈ చైనా యాత్రికుడు భారతదేశములో సుమారు 15 సంవత్సరములుండెను. క్రీ. శ. 630 నుండి 645 వరకు హర్ష చక్రవర్తి పరిపాలనను గూర్చియే గాక, చక్రవర్తి బాల్య జీవితమును గూర్చికూడ పెక్కు వివరములు 'షీ-యూ-చీ' అను గ్రంథములో కలవు. యువాన్ చ్వాంగ్ భారతదేశము వదలి వెళ్ళిన తరువాత హర్షుడు కొద్ది సంవత్సరములే జీవించెను. ఈ యాత్రికుని జీవిత చరిత్రను అతని స్నేహితుడొకడు 'హ్వ్యాలీ' లేక 'యువాన్ చ్వాంగ్ జీవితము' అను పేరుతో వ్రాసెను. దీని

వలన 'యువాన్ చ్వాంగ్' వర్ణనలన్నిటికిని మరింత ప్రామాణికత కలిగినది. ఈ గ్రంథము కూడ హర్షుని కాలమునాటి భారత దేశ స్థితిగతులను తెలిసికొనుటకు ఎక్కువగా ఉపయోగపడుచున్నది.

హర్ష చక్రవర్తిని గూర్చి తెలిసికొనుటకు మనకు మరొక ఆధారము కూడ లభ్యమగుచున్నది. హర్షుని కాలము నాటి శాసనములు మనకెన్నియో లభించుచున్నవి. హర్షుని స్వీయ శాసనములేకాక, అతని సమకాలికుల శాసనములు కూడా లభ్యమైనవి. ఈ శాసనముల వలన నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు తేటతెల్లమగుచున్నవి. వీటన్నిటిలో ముఖ్యమైనవి మూడు; మధుబన్ తామ్రశాసనము ; బాన్స్ఖేరా శిల్ప ఫలకము ; సోనేపట్ తామ్ర ముద్ర. మొదటిది క్రీ.శ. 631 వ సంవత్సరములో వెలువడినది. (హర్షుని పరిపాలనమున ఇరువది యైదవ సంవత్సరమునకు చెందినది.) క్రీ.శ. 628 వ సంవత్సరములో వెలువడినది. (హర్షుని పరిపాలనమున ఇరువది రెండవ ఏటికి సంబంధించినది.) వీటి మూలముగ ప్రభుత్వ శాసనములు ప్రకటితమగుచుండెడివి. ఈ ప్రభుత్వపు శాసనములలో, నాగరికతకల దేశములలో నేడు వెలువడు రాజశాసనమువలె, ఉద్గమస్థాన నామము, ప్రభువు సంతకములుండెడివి. ఇది మహారాజాధి రాజు హర్ష చక్రవర్తి హస్తాక్షరములని కూడ ఉండెడిది. బాన్స్ ఖేరా శిల్ప ఫలకము నందున్న హర్షచక్రవర్తి సంతకము, పాఠకుల కుతూహలార్థమై, యథా తథముగ, నీ క్రింద ముద్రింపబడినది.

పైన పేర్కొన్న ఆధారములే గాక, వేరొక సామాగ్రి కూడ కలదు. సంస్కృత సాహిత్యములో హర్షుని ప్రసక్తి కానవచ్చు చున్నది. హర్షుని నామాంకితులు మరో నలుగురు కానవచ్చినను, మన ప్రస్తుత నాయకునికి సంబంధించిన వివరములు నిర్వివాద ములు, బాణుడు హర్షుని సమకాలికుడు. అతని జీవితకాలము నిర్ణయింపబడినచో హర్షుని కాలము గూడ నిశ్చయించవచ్చును. 'కావ్యప్రకాశము,' 'ధ్వన్యాలోకము' అను గ్రంథములలో హర్ష చక్రవర్తి ప్రసక్తి గలదు. హర్షుడు స్వయముగ గొప్పపండితుడు. అతడు ప్రియదర్శిక, రత్నావళి, నాగానందము అను మూడు నాటకములు వ్రాసెను. అతడు కొన్ని పద్యములు కూడ రచించెను. ఈ సాహిత్యములో హర్షుని కాలమునాటి ప్రజా జీవితము చిత్రించబడినది.

ఈ ఆధారము లన్నిటిని చక్కగ పొందుపరచినచో భారతదేశ ప్రాచీన చక్రవర్తులందరి కంటెను హర్షుని జీవిత చరిత్రయే మనకు సుస్పష్టముగ తెలియుచున్నది.

# II

## ప్రారంభిక జీవితము

హర్షుడు ఒక విఖ్యాత రాజవంశములో జన్మించెను. అతని పూర్వీకులెందరో చరిత్రలో ప్రసిద్ధికెక్కిరి. సుమారు క్రీ. శ. 630లో వెలువడిన మధుబన్, బాన్స్ఖేరా శిలా ఫలకములలో హర్షుని వంశావళి ఈ విధముగ పేర్కొనబడినది.

తండ్రి : ప్రభాకర వర్ధనుడు

తల్లి : యశోమతి

తాత : ఆదిత్య వర్ధనుడు

ముత్తాత : రాజ్య వర్ధనుడు

ఈ వంశమును స్థాపించిన వాడు పుష్పభూతి. అతడు గొప్ప శివభక్తుడు. కాని ప్రస్తుతము మనము హర్షుని తల్లి దండ్రులను గురించి, సోదరీ సోదరులను గురించి మాత్రమే ప్రస్తావించెదము.

ప్రభాకరవర్ధన మహారాజు గొప్ప పరాక్రమవంతుడు. స్థాణ్వేశ్వరము అతని రాజధాని. అదియే నేటి 'థానేశ్వర్'. అది ఢిల్లీ నుండి అంబాలా పోవు దారిలో నున్నది. అతని ధైర్య సాహసములను గురించి బాణుడు విశిష్టమైన ఆలంకారిక శైలిలో ఈ విధముగ వర్ణించెను. 'హూణులను చెండాడునపుడు జింకపై నురుకు సింహము వంటివాడు.' ఇండస్ రాజుకు విషజ్వరము వంటి వాడు. ప్రభాకరవర్ధన మహారాజు గుజరాతు రాజులకు పక్కలో బల్లెమువంటివాడు. గాంధార సుగంధ గజమునకు సోకిన ప్లేగు వంటివాడు. నలుదిశలనున్న గుట్టలను, గుంటలను, అడవులను, పొదలను, చెట్లను, చేమలను, కొండలను, గుహలను చదునుచేసి, అతని విజయోన్మత్త సైనికులు యాత్రా

సౌకర్యములకొరకై రాజ్యమంతట విశాలమైన రోడ్లను నిర్మించిరి. ఈ విజయముల వల్లనే అతడు సామాన్య మహారాజువలె రాజాధి రాజ పరమ భట్టారకుడాయెను.

ఈ పరాక్రమ వంతుడయిన రాజు యశోమతిని పెండ్లాడెను. ఆమె ప్రఖ్యాత మాల్వరాజు కూతురు. వీరికి ముగ్గురు పిల్లలు కలిగిరి. పెద్దవాడు రాజ్యవర్ధనుడు, రెండవవాడు హర్షుడు, అందరి కంటె చిన్నది రాకుమారి రాజ్యశ్రీ.

హర్షుని జన్మతిథిని నిక్కముగ తెలుపు వ్రాత ప్రతులు మనకు లభ్యమైనవి. అతడు క్రీ.శ. 590, జూన్ నెలకు సరియగు జ్యేష్ఠ బహుళ ద్వాదశినాడు జన్మించెను. అతడు సూర్యోదయానంతరము జన్మించెనని సోనెపట్ శిలాశాసనము వలన మనకు తెలియు చున్నది. రాజ్యవర్ధనుడు హర్షునికన్న నాలుగు సంవత్సరములు ముందు జన్మించెను. రాకుమారి రాజ్యశ్రీ ఒకటిన్నర సంవత్సర ముల తరువాత జన్మించింది-రాజ్యశ్రీ పుట్టుకకు హర్షుడు తప్ప టడుగులు వేయుచుండెడివాడని బాణుడు తన హర్షచరితములో నుడివెను. అదే సమయమున రాణి యశోమతి సోదరుడు, రాకుమారుల సాహచర్యమునకై ఎనిమిదేండ్ల ప్రాయముగల తన పుత్రుడైన భండిని పంపెను. రాజ్యవర్ధనుని కన్న కొంచెము పెద్ద వాడగుటచే అతడీ సోదరులకు మిత్రుడే కాక సలహాదారుడు గూడ అయెను. రాజ్యశ్రీకి యుక్తవయస్సు రాగానే, ముఖారిరాజు పుత్రుడైన గ్రహవర్మతో ఆమె వివాహము జరిగినది. వివాహానంత రము ఆమె తన భర్తతో కాన్యకుబ్జమునకు వెళ్ళెను.

స్థాణు అనగా పరమశివుడు. ఈశ్వరుడనగా ప్రభువు. ఈ రెండు పదములతో కూడిన స్థాణ్వీశ్వర రాజధాని కురుమహారాజు పాలించిన పవిత్ర కురుక్షేత్రము. ఎందరో మహా యోధులు పోరాడిన యుద్ధభూమి. ఆరవ శతాబ్దపు ఉత్తరార్థములోనే ప్రభాకరవర్ధన మహారాజు మాలవులను, హూణులను, గుర్జరు

లను ఓడించెను. తిరిగి క్రీ. శ. 604 లో వాయవ్య దిశనుండి హూణ సందోహము మరల రేకెత్తి వచ్చుట విని వారిపై దండ యాత్ర సాగించుటకు కృతనిశ్చయుడయ్యెను. మహారాజు వృద్ధుడగుటచే తన జ్యేష్ఠ పుత్రుడైన రాజ్యవర్ధనునకు సేనాధి పత్యము నప్పగించెను. రాజ్యవర్ధనుడు అప్పటికి పదునెనిమిదేండ్ల వాడు; హర్షునకు పదునాలుగేండ్లు అయినను, తాను గూడా యుద్ధ మున పాల్గొనెదనని తెలిపి అశ్వదళమును ఆయత్తపరచెను. రాజ్యవర్ధనుడు శత్రురాజ్యములో జొరబడి భీకర యుద్ధము చేయు సమయమున హర్షుడు కాననములో సింహములను, ఎలుగుబంటు లను, పులులను వేటాడుచు మృగయాకార్యము చేయుచుండెను.

హర్షుడు అట్లు ఆ ఖేటములో నున్నపుడు వానికి రానున్న కీడు పొడసూపినది. అతని ఎడమ కన్ను అనవరతముగ అదర దొచ్చెను. కారణము లేకయే, అతని శరీరమంతయు గజ గజ వణుకుచుండెను. అతడు నిరాశాపరుడై తన ధైర్యమును గోల్పోవు చుండెను. అట్టి మానసికావస్థలో హర్షుడు ఆనాడు వేటకు పోలేదు. అతని భయము నిజమాయెను. కురంగుడను నొక వార్తాహరుడు వచ్చి అతనికొక సందేశము నిచ్చెను. మహారాజు దాహ జ్వరముతో బాధపడుచు అపాయ స్థితిలో నున్నట్లు ఆ వార్త వలన తెలిసినది. హర్షునకు తన సోదరుని కలిసికొను వ్యవధి లేదు. రోగగ్రస్తుడైన తన తండ్రిని చూచుటకు అశ్వముపైనెక్కి వెంటనే పయనించెను. మూడు రోజులు సత్వర యానము సాగిం చిన పిమ్మట హర్షుడు రాజధాని చేరుకొనెను. ఈ మూనాళ్ళు అతనికి నిద్రాహారములు లేవు. అతని వాడిన ముఖమును నిరీ క్షించి రోగశయ్యనున్న మహారాజు గూడా 'నాయనా! ఇంత చిక్కినావేమి' యని ప్రశ్నించెను.

మహారాజు జాడ్యమును గురించి అక్కడ ఉన్న వారందరిని ప్రశ్నించెను. ఎవరు సరిగా సమాధానము చెప్పలేక పోయిరి.

అక్కడున్న ఆయుర్వేదాచార్యు డొకడు, హర్షుని దగ్గరకు పిలిచి మహారాజు జబ్బును గూర్చి మర్నాటి ఉదయము నిక్కచ్చిగ చెప్పె దననెను. దురదృష్టవశమున రాజు వెనువెంటనే మృతిచెందెను. బహుశ ఆచార్యునకీ సంగతి ముందుగ తెలిసియే యుండవచ్చును. మహారాజునకు రాతితో నొక స్మారక చిహ్నమేర్పరచబడెను. హర్షుడు తన యన్నగారి కోసము వార్తాహరులను బంపెను. వెంటనే రాజ్యవర్ధనుడు రాజధాని వైపుకు మరలెను. హూణుల నెదుర్కొని యుద్ధము చేసినపుడు రాజ్యవర్ధనుడు చాల గాయ పడెను. అతని శరీరమునిండా కట్లే. తండ్రి మరణవార్త చెవిని బడగానే అతనికి వెఱ్ఱి యెత్తినట్లయినది. ప్రపంచమును వదలి సర్వసంగ పరిత్యాగము గావించుటకు నిశ్చయించుకొని, హర్షుని సింహాసనము నధిష్ఠించ వలసినదిగా, రాజ్యవర్ధనుడు ఎంతయో బ్రతిమాలెను. కాని ఉత్తమోత్తముడైన హర్షుడు అందుకు నిరాక రించెను. రాజ్యవర్ధనుడే మహారాజయ్యెను. అతడు నిజముగ సింహాసనము నధిష్ఠించెనో లేదో యనునది సందేహాస్పదమే; బాణుడు తన హర్ష చరితములో ఈ విషయమును ఖండించక పోయినను సన్యసింపబూని, సింహాసనము నధిష్ఠించుటకు రాజ్య వర్ధనుడు నిరాకరించు సమయముననే తన బావగారు హత్య గావింపబడినట్లు వార్తవచ్చెను. కాని ఇతర చరిత్రకారులు హర్షుడు సింహాసనము నధిష్ఠించుటకు తిరస్కరించిన పిమ్మట నీ రాజ్యవర్ధనుడు లాంఛన ప్రాయముగ పట్టాభిషిక్తుడాయెనని వ్రాసిరి.

వెంటనే వారి యార్తికి దీరని యభితాప మావహించినది. గ్రహవర్మతో వైభవముగ నలరారు రాకుమారి రాజ్యశ్రీ ఆకస్మిక ముగ భర్తృవిహీనురాలాయెను. మాళవరాజు ఆమె భర్త శిరస్సును కరవాలమున ఛేదించెను. ఆమె కాన్యకుబ్జమున వారి బందీ యాయెను. ప్రభాకరవర్ధనుడు మరణించుటచే, యువరాజులిద్దరు

హూణుల దాడులలో నిమగ్నులైయుండుటచే మాళవరాజు తన స్వాధీనతను ప్రకటించుటకు చక్కని అవకాశము చిక్కెనని వాపోయెను. కొలదికాలము ముందే సింహాసనము నధిష్ఠించిన రాజ్యవర్ధనుడు ఈ అవమానము నెట్లు సహించగలడు? రాజ్యవర్ధనుడు కుపితుడై యిట్లు గర్జించెనని బాణుడు నుడివెను: "పుష్పభూతి వంశమును అవమానించుటకు మాళ్వులు సాహసింతురా! త్రాచుపామును మింగుటకు కప్ప సాహసించినటులు, లేక అవుదూడ పెద్దపులిని చెరసాలలో బంధించుటకు యత్నించినటులు ఇది ఎంతయేని హాస్యాస్పదము." వెంటనే అతడు రణభేరిని మ్రోగించుటకు ఆదేశించెను. తన సోదరుడైన భండిని, పదివేల మంది సైనికులతో తన వెంట రమ్మని కోరెను. ఈ యుద్ధములో పాల్గొనక వెనుకనుండి పోవుటకు హర్షుడు మిక్కిలి విచారించుచుండెను. రాజు వెంట వెళ్ళుటకయినను లేక స్వయముగ తనపై భారమునంతయు ఒప్పగించుటకైనను అనుమతి ఇయ్యవలసినదిగా హర్షుడు మిక్కిలి వేడుకొనెను. కాని రాజ్యవర్ధను డొప్పుకొనలేదు. వెనుకనుండి రాజ్యమును సంబాళించు చుండమనియే హర్షునకు నచ్చచెప్పెను. తన దళమునుండి విడిపోయిన గజమువలెనున్నను, హర్షుడు తన సోదరుని యాజ్ఞను శిరసావహించెను.

మరియొక విషాద సంఘటన పొడసూప నున్నది. చిన్నవయస్సులో నున్నను, హర్షుడు తన రాచకార్యములన్నిటిని కొద్ది రోజులవరకు చక్కగ నిర్వహించెను. మాళ్వుల నోడించి అనతి కాలములోనే తన సోదరుడు తిరిగి రాగలడని నిశ్చింతగనుండెను. అతడీవిధముగ యోచించుట సహజమే. రాజ్యవర్ధనుడు మాళవ రాజు నోడించి అతనిని కడు తేలికగ లోబరచుకొనెను. కాని విధి విధాన మెవరికెరుక!

గౌడ రాజైన శశాంకుడు రాజ్యవర్ధనుని. అతి వినయముతో మోసబుచ్చి ఒంటరిగ తన అంతఃపురమునకు గొనిపోయి అక్కడ

అతనిని హత్య గావించెను. ఈ దారుణహత్యకు కారణము లెందును కానరావు. మాళ్వరాజు నోడించిన తరువాత రాజ్య వర్ధనుడు తూర్పుదిశగ మరింత చొచ్చుకొనిపోయెనని మనకు తెలియుచున్నది. బహుశ ఇది ఈర్ష్యకు తావయ్యెనేమో. నమ్మిన బంటు కుంతలుని ద్వారా తన సోదరుని మరణవార్త వినిన వెంటనే హర్షుడు ఈ దారుణహత్య గావించిన వారిపై పగసాధిం చుటకు బూనుకొనెను. ఈ గౌడరాజు శశాంకుడే ప్రాచ్య భారత దేశములోనున్న కర్ణసువర్ణమును పరిపాలించిన దుష్ట చక్రవర్తి యని యువాన్ చ్వాంగ్ సరిపోల్చెను. బాణుడు అతనిని గౌడ రాజని పేర్కొనెను. యువాన్ చ్వాంగ్ అతనిని కర్ణసువర్ణు డనియు, బౌద్ధమత ద్వేషియనియు, అనేక బౌద్ధవిహారముల నతడు బ్రద్దలు కొట్టించెననియు, బుద్ధుని పాద చిహ్నములను గంగలో విసిరి పారవేసెననియు, గయలోనున్న బోధి వృక్ష మును ఛేదించెననియు నుడివెను. అనేక దుర్మార్గముల నొనరించి దేశమంతట నపకీర్తి నొందెను. అతడే గుప్తవంశీయుడైన మాళవ రాజుతో సహకరించి, పరాక్రమవంతుడైన కనోజ్ యువరాజును పారద్రోలెను. రాజ్యవర్ధనుడు వారిచేత హత్య గావింపబడెను. హర్షుడు వెనువెంటనే తగు చర్యలు తీసికొని యుండకపోయినచో ఉత్తరమున వారు స్థాణ్వేశ్వరము మీదకూడ దాడిచేసి యుండెడి వారు. ఈ దారుణ హత్యా కారణము నేటికిని మనకు ఇదమిత్థ ముగ తెలియదు. కాని శశాంకుడు తన కొమార్తెను రాజ్యవర్ధ నునకిచ్చి వివాహము చేయదలచెనని 'హర్షచరిత' వ్యాఖ్యాత భావించెను.)

ఏమైననను, త్వరగా ఈ హత్యకు తగిన ప్రతీకారము జరుగ వలసి యుండెను. స్థాణ్వేశ్వరము సర్వశక్తివంతమైన రాజ్యముగ పరిగణింప బడుచుండెను. అందువలన అవసరమైనచో, తన అధి కారమును ప్రకటించుటకు బలప్రయోగమును కూడ చేయుటకు

వెనుకంజ వేయరాదు. ఇద్దరు రాజ కుటుంబీకులు ఇంత అవ మానమునకు గురియైనపుడు చేమ కూడా పామై కరచును.

నాటికి హర్షుడు పదునాలుగు, పదునైదు సంవత్సరముల లేప్రాయము వాడే. సింహాసనము నధిష్ఠించుటకు అతనికే న్యాయ సమ్మతమైన హక్కుగలదు. ఆనాడు కనోజ్‌లోనున్న నాయకు లందరు అతనిని సింహాసనము నధిష్ఠించవలసినదిగ ఎంతగా వేడుకొనిరో యువాన్‌చ్వాంగ్ చాలా రమ్యముగ వర్ణించెను: "ఈ ప్రభువు వైశ్య జాతి యందుద్భవించిన వాడు. ఇతని పేరు హర్ష వర్ధనుడు. ప్రభాకరవర్ధన మహాచక్రవర్తి రెండవ కుమారుడు. ప్రభాకరవర్ధనుని మరణానంతరము అతని జ్యేష్ఠపుత్రుడు రాజ్య వర్ధనుడు సింహాసనము నధిష్ఠించెను. వెనువెంటనే అతడు శశాంకునిచే దారుణముగ హత్య గావింపబడెను. ఈ శశాంకుడు క్రూరుడు. ఇతడు ప్రాచ్య భారతములోని కర్ణసువర్ణ రాజ్య మును పాలించుచుండెను. ఇతడు బౌద్ధమత ద్వేషి. అట్టి స్థితిలో, కనోజ్ నాయకులందరును బాగుగ ఆలోచించుకొని వారి నాయకు డైన బాణి (వాణి) సలహాపై, హర్షవర్ధనుని సింహాసనము నధి ష్ఠించ వలసినదని ఆహ్వానించిరి. హర్షుడు సింహాసనము నధి ష్ఠించుటకు, ఏవేవియో సాకులు చెప్పి వెనుకాడుచుండెను.

మంత్రులందరును హర్షుని సింహాసనము నధిష్ఠించ వలసినదిగ ఒత్తిడి చేయుచున్నపుడు, యువరాజు భోధిసత్త్వుడు అవలోకితే శ్వరుని సలహా పాటించుటకు నిశ్చయించెను. అనేకములగు అలౌకిక శక్తులను ప్రదర్శించిన ఈ బోధిసత్త్వుని విగ్రహము ఈ జిల్లాలో గంగానది యొడ్డున ఒక తోటలో నున్నది. ఉపవాస ముండి, ప్రార్థనచేసి, హర్షుడు దానిని వేడుకొనెను. పూర్వ పుణ్యమువలననే అతడు రాజయ్యెననియు, ప్రభుత్వమును వహించి, కర్ణసువర్ణుని క్రూరకృత్యములచే నాశనమగుచున్న బౌద్ధమతము నుద్ధరించి మహా చక్రవర్తిగ కీర్తిచెందెదవని ఆ

విగ్రహము మారుపలికెను. అంతేకాక, తాను వెనుకనుండి తగు సాయము చేసెదననియు, యువరాజు సింహాసనము నధిష్ఠించ రాదనియు, మహారాజు బిరుదును కూడా ఉపయోగించరాదనియు సలహా నొసగెను. తదుపరి హర్షుడు, శిలాదిత్యుడనే బిరుదు వహించి కనోజ్ రాజయ్యెను. 'కుమారుడు లేక రాకుమారుడ' ననియే చెప్పుకొనెను.

ఆ యాత్రికుడు ఇంకను ఈ విధముగ వర్ణించెను. "శిలాదిత్యుడు రాజ్యభారమును వహించిన వెనువెంటనే, పెద్ద సైన్యమును పోగుచేసి, తన సోదరుని హత్య గావించిన వారిపై పగతీర్చుకొనుటకును, ప్రక్కనున్న రాజ్యములను వశపరచుకొనుటకును దండయాత్రలు ప్రారంభించెను. తూర్పుదిశగ బయల్వెడలి, తన సార్వభౌమత్వమును ధిక్కరించిన రాజ్యములపై దాడి సలిపెను. ఆరు సంవత్సరములు నిరంతరముగ యుద్ధము చేసి 'పంచ భారతమును' వశపరచుకొనెను. ఈ విధముగ తన రాజ్యమును విస్తరింప తన సైన్యశక్తిని మరింత వృద్ధిపరచెను. 60,000 గజదళము, 10,000 అశ్వదళముతో, 30 సంవత్సరముల వరకు, శాంతియుతముగ, ఆయుధ విసర్జన గావించి, చక్కగ పరిపాలించెను. చట్టబద్ధముగ పరిపాలించుచు, తన విద్యుక్త ధర్మమును అతి శ్రద్ధగా నిర్వహించెను. నిద్రాహారములను కూడా కోల్పోయి, జనహిత కార్యములు గావించెను. దేశమంతటను మాంసాహారము నిషేధింపబడెను. మరణశిక్ష రద్దు చేయబడెను. గంగ ఒడ్డున వేలకొలదిగ బౌద్ధస్తూపములను నిర్మించెను. అనేక స్థలముల యాత్రికుల సౌకర్యము కొరకు పెద్ద పెద్ద సత్రములను కట్టించెను. బౌద్ధుల పుణ్యక్షేత్రములలో పెక్కు బౌద్ధ మఠములను స్థాపించెను. పంచ వర్షీయ స్నాత కోత్సవములు జరిపించి, యుద్ధ సామగ్రిని మినహాయించి, తన సర్వస్వమును దానము చేసెను. ప్రతి సంవత్సరము బౌద్ధమతస్థులను సమావేశపరచి దాదాపు మూడు

వారముల వరకు వారికి వలసిన వసతుల నేర్పరుచుచుండెను. మఠములను, విహారములను శోభాయమానముగ నలంకరించెను. మత చర్చలు జరిపించి, వారి వారి యోగ్యతల ననుసరించి సత్క రించుచుండెడి వాడు. నేరస్థులను తగు రీతిగ శిక్షించుటకు కూడా వెనుకాడెడి వాడు కాడు. ఏ పంథావారు, తమ నియమములను, సిద్ధాంతములను సరిగా పాటించుచుండిరో వారికి మతాధిపత్యము నొసగి, వారినుండి మతబోధనలను స్వీకరించెడివాడు. పండితులు గాకున్నను, మత ధర్మములను చక్కగ పాటించెడి వారిని కూడా సత్కరించుచుండెడి వాడు. నియమభంగము గావించు అవినీతి పరులను రాజ్యమునుండి బహిష్కరించెడి వాడు. సత్ప్రవర్తనతో, అహర్నిశలు, నైతికోన్నతికి ప్రయత్నించు ఇరుగు పొరుగు రాజన్యులను, రాజకీయ నాయకులను పిలిపించి వారితో స్నేహ సంబంధములను పెంపొందించుకొనెడి వాడు. దుష్టులతో సంబంధ మును తెగ త్రెంచుకొనుటకు ఏమాత్రము వెనుకాడెడివాడు కాడు. రాజ్య పరిశీలనకై తరచు యాత్రలు గావించెడి వాడు. ఎక్కడ స్థిరముగ నివాస మేర్పరచుకొనక, యాత్రాస్థలములలో తాత్కా లిక వసతి నేర్పరచుకొని యుండెడివాడు. వర్షాకాలములో ఈ యాత్రలుండెడివి కావు. ఈ తాత్కాలిక రాజ నివాసములలో నిత్యమును దాదాపు 1000 మంది బౌద్ధసన్యాసులకు, 500 మంది బ్రాహ్మణులకు భోజన వసతులుండెడివి. తన దిన చర్యలో మూడవ వంతు కాలము రాచకార్యములకును, మిగిలిన రెండు వంతుల కాలము దాన ధర్మములకు, మతచర్చలకు వినియోగిం చెడివాడు. నిర్విరామముగ కృషి చేసెడివాడు. రోజంతయు పనిచేసినను, కాలము సరిపోయెడిది కాదు.

హర్షుని పదవీ స్వీకారమును గురించి, భండికన్న సింహనాదుడే ఎక్కువగ చింతించెనని బాణుడు తెలియపరచెను. సింహాసనము

నధిష్ఠించుటకు హర్షుడు మిక్కలి సంకోచించెననుటలో వారిరువురును ఏకీభవించిరి.

ఈ విషయమును గురించి చారిత్రకులలో భిన్నాభిప్రాయము లున్నట్లు వ్యక్తమగుచున్నది. త్వర త్వరగ, నొకదాని వెంట నొకటిగ సంభవించిన విపత్తుల వలననే హర్షుని ధార్మిక ప్రవృత్తి మరింత దృఢపడెననియు, ఈ ఆధ్యాత్మిక ప్రవృత్తియే అతని సంకోచమునకు హేతు భూతమయ్యెననియు కొందరు నుడివెదరు. రాజ్యవర్ధనునకు సంతానము ఉండెనేమోనని మరి కొందరు భావింతురు. (కాని ఆ సంతానము గురించిన ప్రస్తావన కానరాదు.) లేదా, రాజ్యవర్ధనుని పితంతువు చూలాలియైయుండి వచ్చుననియు, సింహాసనము నధిష్ఠించుటకు ఆ సంతానమునకే సరియైన హక్కు కలదని హర్షుడు భావించి యుండెనేమోనని కొందరి యూహ కాని ఈ అభిప్రాయమును దృఢపరచు సాక్ష్యము లేవియు లభించుట లేదు. సింహాసనము నధిష్ఠించవలసినదిగ హర్షుని ఒత్తిడి చేసినది భండియా లేక సింహనాదుడా యనుటలో గూడ బాణుడు, యువాన్ చ్వాంగ్ భిన్నాభిప్రాయములు వెలిబుచ్చిరి. నిజముగ, వారిరువురు హర్షుని ఒక్క సింహాసనమునే కాదు, కనోజ్, స్థాణ్వేశ్వరము ఈ రెండు సంహాసనముల నధిష్ఠించ వలసినదిగ వేడుకొనిరి. ఈ రెండు సింహాసనములు రాజ్యవర్ధనుని మరణానంతరము రిక్తముగ నుండెను. కనోజ్ సింహాసనము నధిష్ఠించవలసినదని భండియు, మాజీ సైన్యాధిపతి సింహనాదుడు స్థాణ్వేశ్వర సింహాసనము నధిష్ఠించవలసినదని వేడుకొనిరి.

సింహాసనము నధిష్ఠించకుండుటకు మత సంబంధమైన కారణము లేమిటో మనకు తెలియదు. తన ప్రారంభిక జీవితములో హర్షుడు బౌద్ధమతమును స్వీకరించెనని కొందరి అభిప్రాయము. కాని ఇది సరియైనదనుటకు వలనుకాదు. ఎందుకనగా, నాటికి హర్షుడు పదునాలుగేండ్ల లేబ్రాయపు వాడే. మరియు, అదే సమయ

మున తన అధికారమును ధిక్కరించినవారిపై దాడి సలుపుటకు అతడు కృత నిశ్చయుడయ్యెను. చాలకాలము పరిపాలన చేసిన తరువాతనే హర్షుడు బౌద్ధమతమును స్వీకరించి యుండవచ్చును. బహుశ విజయ యాత్రల తరువాతనే.

ఏమైనను, హర్షుడు సార్వభౌముడను బిరుదును స్వీకరించ లేదు. రాకుమారుడు శిలాదిత్యుడని పిలువబడుటకే అతడు సమ్మతించి సంతృప్తి నొందెను.

# III

## హర్షుని దండయాత్రలు

హర్షుని జీవితమును గురించి తెలిసికొనుటకు అతడు పట్టాభిషిక్తుడగుటకు అంగీకరించెనో లేదో యనునది అంత ముఖ్యమైన విషయము కాదు. వాస్తవముగ నతడేరాజు అనుటకు ఏమాత్రము సందేహము లేదు. సింహాసనము నధిష్ఠించుటకు అతనికే చట్టసమ్మతమైన హక్కు కలదని కూడా అందరు భావించిరి. పరిపాలన చేజిక్కిన వెనువెంటనే సహజముగ అతడు తన సోదరుని హత్యగావించిన వారిపై పగ తీర్చుకొనుటకు ఉద్యుక్తుడయ్యెను. అంతేగాక, స్థాణేశ్వర సింహాసనము బ్రద్దలగుచున్నదని భావించెడి గౌడ, మాల్వ మొదలగు సామంత ప్రభువులపై తన అధిపత్యమును ప్రకటించ బూనెను. కేంద్ర నాయకత్వము శక్తి హీనమగునపుడు గాని, లేక స్థానిక నాయకుల ఒత్తిడికి లొంగుచున్నట్లు కన్పించునపుడు గాని, సామంతులలో కేంద్రముపట్ల తిరస్కార భావము క్రమ క్రమముగ పెరుగుచుండును. ప్రప్రథమముగ తన అధిపత్యమును నిక్కచ్చిగ నిరూపించుటకు హర్షుడు తగు చర్యలు తీసికొన నారంభించెను. స్థాణేశ్వర సింహాసనాధీశుని యిష్టాయిష్టములపైననే సామంతుల బ్రతుకు ఆధారపడి యుండెనని ప్రకటించెను. అంతేగాక, నలుదిక్కుల మరింత ముందుకుసాగి, తన రాజ్యసీమలను గూడ దాటి, శక్తిమంతులైన శత్రురాజులను ఎదుర్కొనుటకు కృతనిశ్చయుడయ్యెను.

హర్షుడు మరియొక ముఖ్య కార్యమును కూడ తలపెట్టెను. అతని సోదరి రాజశ్రీ. నేడు భర్తృహీనయై అవమానింప బడుటకు కూడ ఈ ఆలోచనా పరంపరయే కారణము. అనగా ప్రభాకర

వర్ధనుని మరణానంతరము కేంద్రము శక్తి విహీనమైన దనెడి తలంపు. యువావస్థలలోనున్న ఆమె భర్తను దారుణముగ హత్య చేసి ఆమెను భర్తృహీనను చేయుటయేగాక, ఆమెను చాల అవమాన పరచిరి. కాన్యకుబ్జములో, ఆమె కాళ్ళకు సంకెళ్ళు వేసి, ఒక సామాన్య చోరుని భార్యవలె ఆమెను చెరసాలలో బంధించిరి. చెరసాలలోనున్న తన సోదరిని కాపాడుటకు, వెనువెంటనే తగు చర్యలు తీసికొని ఈ ఘోరమైన అపరాధమును గావించిన శశాంకునకు తగు శాస్తి గూడ చెప్పవలసి యుండెను. హర్షుని ఆనాటి మానసిక స్థితిని బాణుడు ఎంత చక్కగ వర్ణించెనో చూడుడు; హర్షుడు నృసింహావతారములోని విష్ణువువలె నుగ్ర రూపమును దాల్చెను.[1] రాజులందరిని దగ్ధము చేయుటకు బయల్వెడలిన జనమేజయుని వలె నిప్పులు గ్రక్కుచుండెను.[2] రిపురక్త పిపాసుడైన వృకోదరునివలె తహ తహ లాడుచుండెను.[3]

అట్టి సమయమున సైన్యాధిపతి సింహనాదుడు హర్షునకు తగిన సలహానొసగి ముందంజ వేయమనెను.[4] "కేవలము గౌడులను గురించియే చింతించవలదు. శశాంకుని అడుగు జాడలలో నడుచుటకు ఎవ్వరును సాహసించకుండ నుండునట్లుగా ఇతరులతో ప్రవర్తించవలయును. జమదగ్ని పుత్రుడు పరుశురాముడేమి చేసెనో చూడుము. తండ్రి వధింప బడినపుడు ఒంటరివాడు. అడవులలో పెరిగి పెద్దవాడయ్యెను. బ్రాహ్మణ వంశస్థుడగుటచే సహజముగ నతడు మెతకమనిషి. కాని అతడు కూడ ఒకసారి పగసాధించ నిశ్చయించుకున్న తరువాత క్షత్రియ వంశములను

[1] హరిరివ ప్రకటిత నృసింహరూపః [2] పారిక్షిత ఇవ సర్వభోగి దహనోద్యతః [3] వృకోదర ఇవ రిపురుధిర తృషితః. దేవ దేవ భూమింగతే నరేంద్రే, దుష్టగౌడభుజంగదగ్ధజీవితే చ రాజ్యవర్ధనే వృత్తేఽస్మిన్ మహాప్రలయే ధరణీ ధారణాయాధునా త్వం శేషః. సమాశ్వాసయ అశరణాః ప్రజాః. క్షమాపతీనాం శిరఃసు శరత్సవితేవ లలాటంతపాన్ ప్రయచ్ఛ పాద న్యాసాన్.

ఇరువదియొక్క సారులు నిర్మూలించెను. వృద్ధరాజు స్వర్గస్థు డయ్యెను. రాజ్యవర్ధనుడు క్రూరుడైన గౌడరాజుచే వధింపబడెను. ఇంత విపత్తు సంభవించినపుడు ఈ భూమిని కాపాడుటకు నీవే మిగిలియుంటివి. శత్రురాజుల నణగద్రొక్కి శరత్కాల రవికిరణ ములవలె ప్రజలకు వేడి నొసగుము.''

ఆ వయోవృద్ధుని సలహాను పాటించుటకు హర్షుడు నిశ్చయించు కొనెను. కొలది కాలములోనే ఈ కార్యమును నెరవేర్చెదనని ప్రతిజ్ఞచేసి హర్షుడు ఈ విధముగ ప్రకటించెను. ''కప్పములను చెల్లించుటకో లేక కత్తులను చేబట్టుటకో రాజులందరు సిద్ధముగ నుండెదరు గాక. చేతులు జోడించి తలలొగ్గియుండుటకో లేక బాణములు చేపూని యుద్ధమునకు సంసిద్ధులగుదురు గాక. నా సార్వభౌమత్వమును స్వీకరించుటకో లేక రణభేరి మ్రోగించుటకో ముందడుగు వేసెదరుగాక. నా పాద ధూళిని శిరసావహించెదరు లేదా కవచములు ధరించి రణరంగమున దుమికెదరు''

ఏదో విధముగ నిర్ణయించుకొన వలసినదని పిన్నపెద్దల భేదములేక హర్షుడు రాజులందరిని సవాలు చేసెను.

వెంటనే హర్షుడు తగు చర్యలు తీసికొననారంభించెను. గజ దళాధిపతికి కబురంపించి పచ్చికబయళ్ళనున్న గజ సమూహము లను మరలించవలసినదిగ ఆజ్ఞాపించెను. త్వరలో తాను దిగ్వి జయ యాత్రకు బయల్వెడలుచున్నటులు ప్రకటించెను. ఆజ్ఞా పాలకుడైన గజదళాధిపతి హర్షుని యాదేశమును శిరసావహించు టకు సంసిద్ధుడయ్యెను, వయస్సులో పెద్దవాడైనందున, తన కన్న చిన్నవాడైన రాజునకీవిధముగ సలహా నొసగెను. ''నీ యెడల నాకున్న శ్రద్ధాభక్తులవలననే నేనొక ముఖ్య విషయ మును చెప్పదలచితిని. సావధానముగ వినగలవు. నీవొక గొప్ప వంశములో జన్మించితివి. నలువైపుల దుష్టులు, దుర్మార్గులు క్రమ్ముకొని యున్నారు. మెలకువగ మెలగవలయును. ఎవరిని

కూడ తెలికగ నమ్మరాదు. జాగ్రత్త'' అనుచు కొన్ని చారిత్రిక సంఘటనలను ప్రస్తావించెను.

రాజులు సుందరీమణుల ప్రేమకు పరవశులైనపుడు గాని, కుట్రలకు గురియైనప్పుడు గాని వారికి ముప్పు వాటిల్లిన పెక్కు సంఘటనలు చరిత్రలో కలవు. ఇవి కల్పనా ప్రసూతములు కావు. వీటికి సిసలైన చారిత్రక ఆధారములున్నవి. కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో ఇటువంటి అనేక సంఘటనలను పేర్కొనెను. కొన్ని బృహత్ సంహితలో కూడ నుదహరింపబడినవి. ప్రేమికుల వలన గాని, సుందరాంగులను నమ్మినపుడు గాని, లేక మరే విధమైన దురభ్యాసములకు లోనైనపుడు గాని, మన దేశములో రాజుల రహస్యములు కోటలుదాటి పోవుటలో విచిత్ర మేమియు లేదు. ఇంకను అతడీ విధముగ చెప్పెను: "హర్ష వర్ధనా! నీ సోదరునకు ఏమి జరిగినదో నీవు చూచితివి. ఇవియే ప్రపంచములోని పోకడలు. నానా దేశములలో, నగరములలో నీవు పలురకములైన మనుష్యులను కలిసికొనెదవు. అందరినీ నమ్ము స్వభావము స్వతహాగా మంచిదైనను, ప్రతిభావంతులైన నీ తాత ముత్తాతలనుండి వంశ పారంపర్యముగా వచ్చుచున్నను, అన్నివేళల నీకు తప్పక లాభదాయకమగునని చెప్పలేము. నీవు యువకుడవు. ఆలోచించి ముందడగులు వేయుము. జాగ్రత్త''

ఈ అమూల్యమైన సలహాను పాటించి హర్షుడు ఒక శుభదినమున సైన్యమును నడిపించెను. సరస్వతీ నదీ తీరమున మొదట మజిలీ గావించెను. అచ్చట గ్రామాధికారి అతనికి ఒక బంగారు ముద్రను బహూకరించి అధికార పత్రము నొసగమని వేడుకొనెను. అప్పుడు కాకతాళీయముగ నొక సంఘటన జరిగినది. అది హర్షుని ఆలోచ నకు నిదర్శనమా యనునట్లు గనిపించెను. తన పేరుతోనున్న బంగారు వేలిముద్ర తలవని తలంపుగా చేతినుండి జారిపడెను. అతని దండయాత్రలకు ఇది అశుభమని అక్కడ నున్న వారం

దరు భావించిరి. కాని హర్షుడు దానిని మరొక విధముగ భావించి ఇట్లనెను. "కాకతాళీయముగ జరుగు కొన్ని సంఘటలను గురించి సరిగా ఆలోచించక, వాటిని అపశకునములుగ భావించి మానవులు పలువిధములుగ విచారపడెదరు. ప్రస్తుతము బంగారు ముద్ర జారి క్రింద పడినది. దీని నిజమైన అర్థమేమనగా నా పేరు మాతృభూమిపై ముద్రింపబడినది. మరొక విధముగ చెప్పవలెనన్న, నేటినుండి మాతృభూమి నా హస్తగతమైనది. నేనీ ప్రపంచమునకు రారాజు" నగుదును. ఇది తర్క సమ్మతమైనను కాకున్నను, ఒక్క విషయము మాత్రము తేటతెల్లమగుచున్నది. ఆయన చిన్నవాడైనను, ఆశాజనక జీవన దృక్పథము నవలంబించి, మూఢనమ్మకములకు ఏ మాత్రము తావివ్వలేదు.

సైన్యము యథావిధిగ ముందుకు సాగెను. ఒకరోజు దీర్ఘ ప్రయాణానంతరము, గుడారములు కట్టివేయబడిన పిదప, ప్రాగ్జ్యోతిష దేశమునుండి (నేటి అస్సామ్) ఒక రహస్య దూత వచ్చెను. అతని పేరు హంసవేగుడు. అస్సామ్ రాజైన కుమారుడు లేక భాస్కరవర్మ అతనిని పంపెను. అస్సామ్ రాజు హర్షునితో సంధి చేసుకొని చిరకాల సఖ్యమును స్థాపింప దలచుకొనెనని ఆ దూత చెప్పెను. హంసవేగునితో అనేకమైన బహుమతులు పంపబడినవి. అందులో నొకటి వరుణుని శ్వేతచ్ఛత్రము. దీనికొక పెద్ద కథ ఉన్నది. దానిని హంసవేగుడు అస్సామ్ రాజయిన కుమారుని తాత ముత్తాతల వంశావళిని పేర్కొనుచు విశదముగ వివరించెను. దూత తెచ్చిన సందేశము యొక్క ముఖ్యాంశము హర్షునితో చిరసంబంధ వాంఛ. హర్షుని వాంఛ కూడా నిదియే. అతడును అదే విధమైన సందేశమును పంపెను. తూర్పు ప్రాంతపు రాజుతో నేర్పరుచుకున్న ఈ స్నేహపు ఒడంబడిక వలన హర్షుడు మిక్కిలి ఆత్మ ప్రత్యయముతో మధ్య ప్రాంతమున నున్న రాజు

లపై దాడిసలుపుటకు ముందుకు సాగెను. హంసవేగుని ద్వారా అస్సామ్ రాజుకు హర్షుడు తన హృదయ పూర్వక శుభాకాంక్షలను, పెక్కు అందమైన కానుకలను పంపెను.

అస్సామ్ రాజుతో ఏర్పడిన స్నేహ సంబంధము వలన మరింత ఉత్సాహము చెంది హర్షుడు తన సంపూర్ణ బలముతో తనకు నేరుగ నున్న శత్రువు గౌడునిపై దాడి సలిపెను. ఆ రోజులలో వార్తలు దూతల ద్వారానే పంపబడు చుండెడివి. హర్షుడు తన శిబిరములో నున్న సమయముననే అతనికొక వార్త వచ్చినది. మాల్వారాజుపై సాగించిన దండయాత్రలో, రాజ్య వర్ధనుని అనుసరించిన తన సోదరుడు భండి దగ్గరలోనే మకాములో నున్నట్లు తెలిసినది. మాళవరాజు ఎన్నడో ఓడిపోయెననెడి శుభవార్తను కూడ ఆ దూత తెలియపరచెను. భండి అనతి కాలములోనే హర్షుని కలిసికొని రాజ్యవర్ధనుని మృత్యుసమాచారమును గూడ విపులముగా వర్ణించెను. హర్షుని సోదరి రాజ్యశ్రీని గురించి గూడ చెప్పెను. రాజ్యశ్రీ జైలునుండి బయటకు వచ్చినదనియు, కాని అరణ్యములలో నెక్కడనో ఉండెననియు, ఆమె జాడ తెలియదనియు చెప్పెను. తన సోదరుడు, రాజ్యవర్ధనుని మరణానంతరము మరింత అవమానమునకు గురియగుదునను భయము వలననే ఆమె కానరాకుండెను. ఇది విని హర్షుని హృదయము ద్రవించినది. తన సోదరి జాడను తెలిసికొనుటకు అతని ఆతురత సహజముగ నెక్కువైనది. హర్షుని జ్యేష్ఠ సోదరుడైన రాజ్యవర్ధనుని దారుణ హత్య గావించిన గౌడరాజు శశాంకుని భండి ఏవిధముగ నెదుర్కొనెనో మనకు తెలియదు. హర్షునితో యుద్ధములో శశాంకుడు ఓడిపోయినను, పట్టుపడక ఎక్కడనో నేదో విధముగ జీవించుచుండెనని మనకు తెలియుచున్నది. అటు పిమ్మట గూడ పన్నెండు సంవత్సరముల వరకు అతడు రాజ్యము చేసెననుటకు ఆధారములు గలవు. క్రీ. శ. 637 లో శశాంకుని

మరణానంతరమే హర్షుడు పశ్చిమ బెంగాల్‌ను ఆక్రమించుకొని యుండవచ్చును.

తన సోదరి రాజ్యశ్రీని వెదికి తెచ్చుటకు హర్షుడు సర్వవిధముల ప్రయత్నము చేయుటకు సంకల్పించుకొనెను. దురదృష్టవంతురాలైన రాజ్యశ్రీని వెదుకుచు, వింధ్యారణ్యములో తిరుగుచున్నపుడు, నిర్ఘాతుడను భిల్లుల సేనానాయకుని కలిసికొనెను. దివాకర మిత్రుడను ఋషిపుంగవుని ఆశ్రమమునకు వెళ్ళుమని హర్షునకు అతడు సలహానిచ్చెను. దివాకర మిత్రుడు బ్రాహ్మణ మతమును వదలి బౌద్ధమతము నవలంబించెను. ఆ ఆశ్రమమునకు వెళ్ళగానే హర్షునకొక వార్త తెలిసినది. ఎవరో ఒక యువతి స్వీయదహనముతో ఆత్మహత్య గావించుకొనుటకు ఉద్యుక్తురాలగు చుండెనని ఒక బౌద్ధభిక్షువు చెప్పెను. తన సోదరి జాడ తెలిసికొనుటకై ఎంతో ఆతురతతోనున్న హర్షుడు ఆమెయే రాజశ్రీయై ఉండవచ్చునని సరిగా తలపోసెను. అతని తలంపు సరియైనది. అతడు వేగముగ అచ్చట కరుదెంచి ఆ సాహస కృత్యమునుండి ఆమెను కాపాడెను. సోదరీ సోదరుల పునస్సమాగమము జరిగినది. నిరాశతో ఏ విధముగ ఆమె ఆత్మహత్య చేసుకొనుటకు నుద్యుక్తురాలయ్యెనో విశదపరచినది. ఇప్పుడు ప్రాణములు దక్కినందువలన ఆమె కాషాయ వస్త్రములు ధరించి, సన్యాసిని కాదలచినట్లు తెలియపరచినది. కాని హర్షుడు ఆమెను తనతో నుండవలసిందని మిక్కిలి ప్రాధేయపడెను.

ఇప్పుడు హర్షునకు తన సార్వభౌమత్వమును స్థాపించుకొనుటకు వీలుచిక్కినది. తాను సాధింపదలచిన రెండు కార్యములను నెరవేర్చెను. తన సోదరుని హంతకుడు, తన సోదరి భర్తను హత్యగావించిన రాజు, ఇద్దరు పాదాక్రాంతులయిరి. 5,000 గజదళమును, 20,000 అశ్వదళమును, 50,000 కాల్బలమును గలిగిన పెద్ద సైన్యమును ప్రోగు చేసెను. యువాన్

చ్వాంగ్ వివరముల ననుసరించి హర్షుడు ప్రథమముగా తూర్పు దిశకు పురోగమించెనని తెలియుచున్నది. ఇది సహజమే గదా! అతని రాజనీతిజ్ఞతను తెలిసికొనుటకు నాటి భారతదేశమును పరిపాలించెడి విభిన్న రాజకీయ శక్తులను దృష్టిలో నుంచుకొనవలెను.

హర్షుని పూర్వీకులు మహారాజులనబడెడివారు. చిన్న చిన్న రాజులను ఆ రోజులలో మహారాజులనెడివారు. అనగా స్థాణేశ్వరమును అప్పటికి మన మొక చిన్న రాజ్యముగనే పరిగణింపవచ్చును. ప్రభాకరవర్ధన మహారాజు దానిని విశాలముగను, శక్తివంతముగను రూపొందించెను. బాణుడు ప్రభాకరవర్ధనుని గురించి ఈ విధముగ వర్ణించెను.

"హూణ హరిణమునకు సింహముగను, సింధు ప్రాంతపు రాజునకు విషజ్వరముగను, గుర్జరులకు సింహ స్వప్నముగను, గాంధారులకు ప్లేగు వ్యాధివలెను, అన్యాయులు, అత్యాచారులైన లాటులకు దోపిడీకారువలెను, మాళవ లతకు గొడ్డలిపెట్టు వంటివాడు."[1]

ఈ విధముగ పైన చెప్పబడిన ఆరు రాజ్యములు ప్రభాకరవర్ధనునిచే జయించబడి, అతని స్వాధీనములో లేకపోయినను, కనీసము అతని పేరు విని భీతి చెందుచుండెడివి. ఈ విధముగ, హర్షుడు తన రాజ్యమునకు వారసుడైనపుడు, దానికి వాయవ్యమున హూణులు, పశ్చిమమున గుర్జరులు (గూర్జర ప్రాంతము నేటి గుజరాత్ కాదు కాని, ప్రస్తుతము పాకిస్తానులోనున్న పూర్వపు పంజాబు, సింధు ప్రాంతములోని గుజరాత్ జిల్లా దగ్గర ప్రదేశము) నైఋతముగా లాటులు (నేటి గుజరాత్‌లోని బరోచ్‌కు

---

[1] హూణహరిణకేసరీ, సింధురాజ జ్వరో గుర్జరప్రజాగరో, గాంధారాధిప గంధద్విపకూటపాకలో, లాటపాటవపాటచ్చరో, మాలవలక్ష్మీలతాపరశుః.

దగ్గరగా నున్న ప్రదేశము) తూర్పున గౌడరాజ్యము కలదు. (రమారమి నేటి బెంగాల్‌కు పోలినది.)

హర్షుడు తన సోదరిని అవమానించిన వారిపైనను, తన సోదరుని హత్య గావించిన వారిపైనను పగ దీర్చుకొనుటకు పూనిన ప్రతిజ్ఞను దాదాపుగ నెరవేర్చుకొనెనని ఇంతకు ముందే తెలుపబడినది.

మొదటి విషయమునకు సంబంధించిన గౌడరాజు శశాంకుడు రాజ్యశ్రీ భర్తను హత్యగావించిన పిదప ముఖారి రాజ్యమును వశ పరచుకొనెను. భండి యొక్క విజయవంతమైన ముట్టడి వలన శశాంకుడు అచటనుండి పారిపోగా కనౌజ్ సింహాసనము ఖాళీగా నుండెను. గౌడరాజు కనౌజ్‌ను విడిచి వెళ్ళుటకు మరొక కారణము గలదు. హర్షునకు, కామరూప రాజైన భాస్కరవర్మకు మధ్య జరిగిన స్నేహ సంబంధమును గూర్చి అతడు వినియుండ వచ్చును. వీరిరువురి కలయిక వలన రెండు మహాశక్తుల మధ్య నలిగిపోవుదునని భయపడి, తెలివిగ తప్పుకొనుటయే సమంజసమని భావించి కనౌజ్ వదిలివెళ్ళెను.

ఆ సమయమున కనౌజ్ రాజ్యము చాల హీన స్థితిలో నుండెను. ముఖారి రాజు హత్య గావింపబడెను. అన్యాయముగ ఆక్రమించుకొన్న గౌడరాజు శశాంకుడు రాజ్యమును అల్లకల్లోల స్థితిలో వదలి పారిపోయెను. బాహ్యపు ఆక్రమణలనుండి రక్షించుటకేగాక, సరియైన పరిపాలనను ప్రవేశపెట్టి అంతరంగికముగ సుస్థిరము చేయుటకు ఆ రాజ్యమునకొక శక్తివంతుడైన పాలకుని నాయకత్వము ఎంతయేని అవసరముగ నుండెను. కడపటి ముఖారి రాజునకు వారసులు లేరు. (రాజ్యశ్రీ భర్త గ్రహవర్మ వధింపబడెను.) అతని బంధువులందరు అదృశ్యులైరి, లేదా గౌడ రాజు వారిని హత మార్చెనని బాణుడు వ్యాఖ్యానించెను. అట్టి పరిస్థితిలో ముఖారి సింహాసనము భర్తృ విహీనురాలైన

రాజ్యశ్రీకి దక్కనున్నది. అంతటి బాధ్యతను వహించుటకు ఇంకను ఆమె చిన్న వయస్సులోనే ఉన్నది. అంతేకాక, సన్యసించుటకే ఆమె నిశ్చయించుకొనెను.

అందువలన హర్షుడు ఆ భారమును వహించవలసి వచ్చెను. కనౌజ్ రాజ్యభారమును వహించవలసినదిగా పెద్దలందరు ఇట్లు వేడుకొనిరి. "హర్షుడా! శత్రువులను జయించి, రాజ్య పరాభావమును దీర్చి, విజయవంతముగ, వైభవోపేతముగా రాజ్యము నేలుకొనుము." కనౌజ్ రాజగుట సరియో, కాదో అందరి సహాయము తనకు లభించునో, లేదో యని హర్షుడు మొదట కొంత సంకోచించెను. బోధిసత్వుడగు అవలోకితేశ్వరుని సంప్రదించిన తరువాత చిట్టచివరకు రాజ్య సింహాసనమును స్వీకరించుటకు నిశ్చయించుకొనెను. కాని 'కుమారుడ' ను నామధేయముతోనే అతడు రాజ్యమును పరిపాలించెను. వితంతు సోదరి రాజశ్రీ సహకారముతో పాలించెనని "ఫాగ్ - ఛీ" అను చీనీ గ్రంథము వలన తెలియుచున్నది. అయినను మొదటిలో కాన వచ్చు శంకా సంకోచములు అతడు శక్తివంతుడైన పిదప కానరావు. క్రమముగ స్థాణేశ్వరము, కనౌజ్ ఒకే రాజుక్రిందకు వచ్చినవి. అంతేగాక, హర్షుడు తన రాజధానిని గూడ కనౌజ్‌కు మార్చెను. ఇట్లొనరించుటకు వేరొక వ్యూహ మేదైన ఉండవచ్చును. స్థాణేశ్వరము ఒక మూలగనున్నది. హర్షుని రాజ్యము ఉత్తర హిందూ స్థానమంతటను వ్యాపించినపుడు, మధ్యలో నున్న కనౌజ్ అనుకూలముగ నుండునని తలచి యుండవచ్చు. మరియు అతడు క్రొత్తగా స్థాపించిన సామ్రాజ్యమునకు స్థాణేశ్వరము వాయవ్య దిశలో నుండుటచేత హూణుల దాడులకు మరింత చేరువగా నున్నది.

హర్షుడు తూర్పుదిశగ బయల్వెడలి, తన ఆధిపత్యమును నిరాకరించిన రాజ్యములపై నిరంతరము దాడులుసేయుచు ఆరు

సంవత్సరములలో "పంచభారతములను" ఎటుల లోబరచు కొనెనో యువాన్ చ్వాంగ్ చాల చక్కగా వర్ణించెను. హర్షుడు జయించిన రాజ్యముల పూర్తి వివరములు యువాన్ చ్వాంగ్ తెలుప లేదు. యువాన్‌చ్వాంగ్ వర్ణనలలో మరియొక ప్రసక్తి కలదు.

"హర్షుడు వెనువెంటనే తన సోదరుడు గురియైన దెబ్బకు పైదెబ్బ కొట్టి యావద్భారత దేశమునకు తానే సార్వభౌముడనని నిరూపించెను. శిలాదిత్య మహారాజు తూర్పునుండి పడమర వరకు నున్న రాజ్యములను లోబరచుకొనుచు తన సైన్యమును చాల ముందుకు సాగించెను." ఇందును యువాన్ చ్వాంగ్ తన అభిప్రాయమును స్పష్టపరచలేదు. హర్షుడు ఇంతటి మహాకార్య మును ఎటుల సాధించెనో, ఏఏ రాజ్యములను జయించెనో, లోబ రచుకొనెనో, విశదీకరించ లేదు. హర్ష చరిత్రకారుడు, అతని సమకాలికుడు బాణుడు గూడ మహా పరాక్రమ వంతుడైన హర్షుని కీర్తిని వేనోళ్ళ కొనియాడుటయే కాని అతని దండయాత్రల వివర ములను ఉగ్గడించలేదు. గౌడ యుద్ధ సన్నాహములో హర్షుడు నిమగ్నుడైయుండెనని మాత్రము తెలిపెను. ఇంతియే గాక అతడు సింధురాజును నాశనము చేసెననియు, అజేయమైన హిమవత్ప ర్వతములచే ఆవరించియున్న దేశము నుండి కప్పము పుచ్చుకొనె నని కూడ వ్రాసెను. బహుశ ఇది నేపాలు దేశమై యుండ వచ్చును. హర్షుడు నాలుగు సముద్రముల నేలిన ప్రభువనియు, అతని కాలిగోళ్ళు రాజులందరి కిరీటములలోని మణులచే ధగ ధగ లాడుచుండెననియు వర్ణించెను. వీటిని యధాతధముగ నమ్మ లేము. హర్షుని విజయ పరంపరలను గురించి సందేహము లేకున్నను, హర్షుని సామ్రాజ్యము ఉత్తర హిందూ దేశముననే వ్యాపించి యుండెననియు, అందును రాజస్థాన్, సింధు ప్రాంత ములలోని పడమటి భాగములు చేరియుండ లేదనియు తెలియు చున్నది. తూర్పుదిశను, నేటి బెంగాల్‌ను పరిపాలించిన శశాం

కుడు పూర్తిగ నోడింపబడలేదు. ఎందువలననగా క్రీ. శ. 619 వరకు కూడ అతడు గౌడ రాజనియే పిలువబడుచుండెను. మరి కామరూపము, నేటి అస్సాం, మరియు తూర్పు బెంగాల్‌లోని కొంత భాగము, హర్షునితో స్నేహముగ నుండెనేకాని అతనిచే జయింప బడలేదు. పాఠకుల ఉపయోగార్థమై హర్ష సామ్రాజ్యమును తెలుపు పటము పుస్తకము చివర ముద్రింపబడినది.

మన మింక హర్షుని విజయ పరంపరలను గూర్చి చర్చింతము.

మాళవరాజు నోడించి, శశాంకుని ముఖారి రాజ్యమునుండి పారద్రోలి, కామరూప రాజు (అస్సాం)తో మైత్రి నేర్పరుచు కొనిన తరువాత హర్షుడు శక్తివంతుడైన రాజయ్యెను. తన ప్రక్క నున్న మిగిలిన రాజ్యములన్నియు చిన్న చిన్నవే. ఈ రాజు లందరు అతని సార్వభౌమత్వమును స్వీకరించి అతనికి కప్పములు చెల్లించెడి వారు. ఈ విధముగ ఉత్తర పశ్చిమమున స్థాణేశ్వరమునుండి, కామరూపము యొక్క సరిహద్దువరకు హర్షుడు సార్వభౌముడయ్యెను. హర్షుడు నేపాలును కూడా ముట్టడించె ననెడి వివరము కలదు. నేపాలు రాజు కేవలము సామంతు డనియే తెలుపు కొన్ని నేపాలు శాసనములు కూడ కలవు. యువాన్‌చ్వాంగ్ అతనిని, నిన్న "మొన్నటి రాజు" అనియే పేర్కొనెను. హర్షుడు నేపాలును జయించిన తరువాతనే బహుశ నేపాలులో హర్ష శకము ప్రారంభమై యుండవచ్చును. బాణుడు తన హర్ష చరితములో హర్షుడు నేపాలు రాజునుండి కప్పములు పుచ్చుకొనెనని వర్ణించుచు అది అభేద్యమైన మంచు పర్వతముల పైనున్న దేశమని నుడివెను. హర్షుడు నిక్కచ్చిగ నెప్పుడు నేపాలును ముట్టడించెనో తెలుపు ఆధారము లేవియు లేవు. ఆ ముట్టడి పరిణామమేమిటో అది ఎప్పుడు ముగిసెనో కూడా మనకు తెలియదు. హర్షుడు ఒకానొక దుర్గమైన మంచు ప్రాంతమునుండి పన్నులు వసూలు చేసెననియే బాణుడు నుడివెను. బాణుడు నుడి

విన "దుర్గాయా గృహీత: కర: 'అను వాక్యమును కొందరు దురపాణి గ్రహమని చెప్పెదరు. కాని హర్షుడు సిమాలయ రాజ కన్యను వివాహ మాడెననుటకు' తగిన ఆధారములు లేవు. హర్షుడు నలుదిశల భయంకర యుద్ధములు చేసెననియు" పంచ భారతములను లోబరుచు కొనెననియు మాత్రమే మనకు తెలియును.

తన దిగ్విజయ యాత్రలో హర్షుడు మగధను కూడ లోబరుచు కొనెను. మహాచక్రవర్తి అశోకుని తుది వారసుడైన, పూర్ణవర్మ రాజు 7 వ శతాబ్దపు ప్రారంభములో నివసించెనని యువాన్ చ్వాంగ్ వ్రాసెను. ఈ రాజు శశాంకునిచే నిర్మూలింప బడిన బోధివృక్షమును మరల స్థాపించెను. అనగా బౌద్ధమతమును పునరుద్ధరించెను. పూర్ణవర్మ మరణానంతరం అతని రాజ్యము హర్షుని హస్తగతమైనది. చైనీయుల వ్రాత ప్రతులలో హర్షుడు మగధ రాజుగ పేర్కొనబడెను. యువాన్‌చ్వాంగ్ కూడ శిలాదిత్యుడు (హరుడు) నలందా వద్ద కంచు దేవాలయ మొకదానిని నిర్మించినట్లు వర్ణించెను. అచ్చట హర్షుని ముద్రలు కూడా కనబడినవి.

హర్షుడు తన చివరి దశలో వూతూ లేక నేటి ఒరిస్సాను కూడ ముట్టడించి స్వాధీనపరచు కొనెనని తెలియు చున్నది. యువాన్ చ్వాంగ్ ఈ ప్రాంతమునకు వచ్చినపుడు అది కనౌజ్ రాజు, హర్షుని అధీనమునందున్నట్లు పేర్కొనబడెను. హర్షుడు వూతూను బలవత్తరమైన సరిహద్దు ప్రాంతముగ రూపొందించి నట్లగుపడు చున్నది. కొంగొండ (నేటిగంజాం) ను స్వాధీనపరచుకొని శిలాదిత్యుడు (హర్షుడు) 'వూతూ' నందు కొంతకాలము మకాము చేసెననియు, జయసేనునకు ఎనుబది పెద్ద గ్రామముల రాజస్వమును కానుకగ నిచ్చెననియు చెప్పబడినది.

ఇంతకుముందు చెప్పబడినట్లు హర్షుడు కామరూపి (అస్సామ్)

రాజుతో మైత్రిని నెలకొల్పు కొనెను. "యువాన్ చ్వాంగ్ కథ నానుసారము పరిపాలించుచున్న రాజు బ్రాహ్మణుడు; అతని పేరు భాస్కరవర్మ లేక కుమారుడు. "అతడు వేయేండ్లనుండి వచ్చుచున్న రాజ్యవంశములోని వాడు." ఇది అతిశయోక్తియై యుండవచ్చును. తన పొరుగు రాజయిన శశాంకుని కీర్తి దిన దినము పెరుగుట చూచి భాస్కరవర్మ ఎక్కువగ ఆందోళన చెందెను. ఆ శశాంకుడే రాజ్యవర్ధనుని దారుణ హత్య గావించెను. ఈ పొరుగురాజు భయము వలననే భాస్కరవర్మ స్నేహబంధ మును పెంపొందించుకొనదలచి, విలువైన కానుకలతో హర్షుని వద్ద కొక దూతను పంపెను. ఈ నూతన స్నేహసంబంధము వలన హర్ష భాస్కరవర్మ లిరువురకు ఎనలేని మేలు జరిగినది. ఇద్దరు సరిసమానుల మధ్య ఏర్పడిన స్నేహసంబంధము అది. అయినను బాణుడు కామరూప రాజు గురించి ప్రస్తావించుచు "అత్ర దేవేన అభిషిక్తః మారః" అనగా హర్షునిదే పై చేయని ధ్వనించునట్లు నుడివెను. బాణుడు బహుశ భాస్కరవర్మ అభిషేక మును గురించి ప్రస్తావించలేదు. మగధ రాజ్యమునకు అధికారిగ నియమింపబడిన హర్షుని స్నేహితుడు మాధవగుప్తుని గురించిన ప్రస్తావన యేమో.

హర్షునకు సంబంధించిన వేరొక గాథ కలదు. అందు కామరూప రాజు, యువాన్‌చ్వాంగ్ అంతగా చర్చింప బడలేదు. కామరూప రాజును భాస్కరవర్మ వద్దనున్న చైనా యాత్రికుని పిలిపించెనని తెలియుచున్నది. ధైర్యమున్నచో యాత్రికుని శిరస్సును ఛేదించి తీసుకొనవమని జాబు పంపినట్లు, అందుకు హర్షుడు కుపితుడై, అటు లనే ఆ యాత్రికుని శిరచ్ఛేదనమునకు తగు సన్నాహము చేసెదవని తిరిగి జాబు పంపెనని చెప్పెదరు. కథలో ఇంకను నిట్లు పేర్కొన బడినది. "ఈ జాబు చూచిన తరువాత హర్షుని శక్తి సామర్థ్యము లను గుర్తెరిగిన తరువాతనే ఈ ఇద్దరు రాజుల మధ్య స్నేహ

సంబంధ మేర్పడె నందురు. కాని ఇది అర్థము లేనిది. ఎందు వలన అనగా యువాన్ చ్వాంగ్ క్రీ. శ. 643 లో హర్షుని అస్థాన మును సందర్శించెను. కాని ఈ ఒడంబడిక ముప్పది సంవత్స రములకు పూర్వమే జరిగెను.''

ఈ విధముగ శత్రువులందరిని ఓడించిన తరువాతనే, అస్సామ్ రాజుతో స్థిర మైత్రిని నెలకొల్పుకొనిన తరువాతనే, హర్షుని ప్రాభవము ఉత్తర హిందూ దేశమంతటను పంజాబునుండి బెంగాల్ వరకు వ్యాపించెను. కాని అంతటితో అతని రాజ్య కాంక్ష తీరలేదు. అతని దృష్టి పశ్చిమమునకు, తరువాత దక్షిణ మునకు మరలినది. వింధ్య పర్వతమునకు దక్షిణముగ నున్న ప్రాంతమును రెండవ పులకేశియను మహారాష్ట్ర రాజు పాలించు చుండెను. అతడు సుస్థిరముగ రాజ్యము నేలుచు, హర్షుని కాంక్షల నరికట్టుటకు సంసిద్ధుడుగ నుండెను. రెండవ పులకేశి హర్షుని సార్వభౌమత్వము నంగీకరించలేదు. హర్షునకు తన శక్తి సామర్థ్యములపై ఎనలేని విశ్వాసము. కాని రెండవ పులకేశి కూడ తక్కువ వాడు కాదు. దక్షిణాపథము నంతటికిని తానే సార్వభౌముడనని అతడు ప్రకటించెను (దక్షిణాపథపృథ్వ్యాః స్వామీ) అతడు హర్షునకు మించిన చేయియే.

రెండవ పులకేశి రాజ్యము చాలా విశాలమైనది. ఉత్తరమున వింధ్య పర్వతములనుండి సరాసరి దక్షిణమున పల్లవుల రాజ్యమువరకు వ్యాపించి యుండెను. అతడిదివరకే గుజరాత్, కళింగ దేశ రాజులను ఓడించెను. బహుశ క్రీ. శ. 634 లో హర్షునితో యుద్ధము జరిగెను. క్రీ. శ. 636 లో వెలువడిన శాసన ములో ఈ యుద్ధము పేర్కొన బడినది. రెండవ పులకేశి జయించెననియు, హర్షుని హర్షము వాడిపోయె ననియు (హర్ష విభేదహేతుః) మరియు హర్షుని గజదళము పూర్తిగ నాశన మయ్యెనని, మరియు ఎవరి పాదములు అనేక సామంతుల వజ్ర

ములతో నిండియుండెడివో, అనగా అందరును ఎవరి పాదములకు మ్రొక్కుచుండెడివారో, అట్టి హర్షుడు సంతోషరహితుడై, క్రుంగి కుమిలిపోయెను. (అపరిమిత విభూతి - స్ఫీత సామంత సేనా ముకుటమణిమయూఖాక్రాంత పాదారవిందో యుధిపతిత గజేంద్రానిక విభత్సభూతో భయగలిత హర్షో యేన చాకారి హర్షః) ఇంతియేగాక, చాళుక్యరాజు రెండవ పులకేశి "పరమేశ్వర" అను బిరుదును సంపాదించెను. 7 వ శతాబ్దములో ఈ పరాక్రమవంతుడైన మహారాష్ట్ర రాజుచేత హర్షుని సైన్యముల ఓటమి నిజముగ ప్రాచీన మహారాష్ట్ర చరిత్రలోని బంగారు పుటలు. ఈ ఓటమితోనే హర్షుని దిగ్విజయయాత్ర కూడ ఆగిపోయినది.

హర్షుడు యుద్ధములన్నిటిని మొదటి ఆరు సంవత్సరములలోనే (క్రీ. శ. 606 నుండి 612 వరకు) ముగించెననియు, తరువాత 30 సంవత్సరములు ప్రశాంతముగ కాలము గడిపెననియు వ్రాసెను. అతడు వ్రాసిన మాటలకు సరియైన లిప్యంతరమిది. "చూయీా సాన్ షిహనీన్ పింగ్ కో పూచీ". చూయీా అనగా రాజదుస్తులని అర్థము చెప్పబడినది.

క్రీ. శ. 636 లో ఈ చైనాయాత్రికుడు హర్షుని ఆస్థానమును సందర్శించెను. అప్పటికి హర్షుని రాజ్యము శాంతియుతముగ నుండెనని చెప్పుటయే దీని సారాంశము. కాని, క్రీ.శ 643 వరకు కొంగొండ (నేటి గంజామ్‌జిల్లా) జయించువరకు, యుద్ధములు చేయుచుండెననియే మనకు తేటతెల్లమగుచున్నది. దక్షిణదిశకు సాగకమునుపే, హర్షుడు పశ్చిమ ప్రాంతములో దండయాత్ర చేసెనని తెలియుచున్నది. వల్లభిరాజు ధ్రువసేనుడు, తొందర మనిషి అనియు, స్థిరాభిప్రాయములు లేనివాడనియు యువాన్ ఛ్వాంగ్ పేర్కొనెను. అతని ప్రధాన లక్షణము బౌద్ధమతములో అతనికున్న విశ్వాసమే. అతనిని యుద్ధములో నోడించి హర్షుడు అతనితో సరిగా వ్యవహరించెను. శక్తివంతుడైన చాళుక్యరాజు,

రెండవ పులకేశికి విరుద్ధముగ అతనిని ఉపయోగించుకొనుటకే హర్షుడు ఈ విధముగ వ్యవహరించెను. అందువలన హర్షుడు ధ్రువసేనుని తిరిగి సింహాసన మెక్కించెను. ఇంతియేగాక, అతనికి హర్షుడు తన కూతురునిచ్చి పెండ్లి చేసెనని గూడా చెప్పెదరు. ఇది రాజకీయ వివాహమనియే విశదమగుచున్నది. పశ్చిమదిశను బాగుగా దృఢపరచుకొన్న తరువాతనే హర్షుడు రెండవ పులకేశి పై దండెత్తెననుటలో ఏ మాత్రము సందేహము లేదు. ఇంతకు ముందు చెప్పినట్లు, ఇంత చేసినప్పటికిని రెండవ పులకేశిపై గావించిన హర్షుని దండయాత్ర విఫలమయ్యెను. అయినను, హర్షుడు గొప్ప రాజనీతి విశారదుడని మనమొప్పుకొనవలయును. కామరూప రాజుతో అతడు ఏర్పరచుకొన్న స్నేహసంబంధము వల్లనే గౌడరాజును అతడు తేలికగ జయించగలిగెను. అందు వల్లనే గౌడరాజు కనౌజ్‌లోనున్న ముఖారి సింహాసనమును హర్షునకు వదలి, రాజ్యము వీడి పారిపోయెను. వల్లభి రాజును ఓడించి తరువాత అతనితో సంధి చేసికొనుట, రెండవ పులకేశిని, వల్లభి రాజ్యము గుండా హర్షుని రాజ్యములోనికి రానీయకుండుటకే యని ధ్రువమగుచున్నది. దురదృష్టవశముగ, రెండవ పులకేశి హర్షునకు మించిన శక్తివంతుడగుటచే, హర్షుడు రెండవ పులకేశి సామ్రాజ్యములోనికి జొచ్చుకొని పోజాలక పోయెను. నాటికే రెండవ పులకేశి దక్షిణాపథము నంతటికి ప్రభువై ఉత్తర హిందూ దేశమున హర్షుని వలె, సుస్థిరమైన సామ్రాజ్యమును స్థాపించెను.

ఈ ఓటమి తరువాతనే బహుశ హర్షుడు శాంతియుతముగ జీవితము గడుపుటకు నిశ్చయించుకొనెను. వింధ్యపర్వతములకు ఉత్తరముగా నున్న దేశమును పరిపాలించిన గొప్ప రాజులలో నొకడుగా అతడు పరిగణింపబడెను. క్రీ. శ. 641 లో హర్షుడు చైనా రాజయిన 'తాయీతుంగె' ఆస్థానమునకు ఒక బ్రాహ్మణుని

రాయబారిగా పంపెను. చైనా దేశపు అనధికార ప్రతినిధి అప్పటికే భారతదేశములోని వివిధ రాజ్యములను సందర్శించు చుండెను.

గజ, తురగ, రథ, పదాతులతో కూడిన హర్షుని సైన్యము చాల శక్తివంతమైనది. అందువలననే అతడిన్ని విజయములను పొందగలిగెను. తొలుత 5000 ఏనుగులు, 2000 గుఱ్ఱములు, 50,000 కాల్బలము కలిగిన తన సైన్యమును, పెంపొందించి, 60,000 గజ బలముతో, 1,00,000 అశ్వదళముతో దానిని ఎక్కువ శక్తివంతముగ చేసెను. హర్షుడు తన ఆస్థానమునకు బాణుని ఆహ్వానించెను. బాణుడు చక్రవర్తిని సందర్శించి తాను కన్న, విన్న విషయములన్నిటిని విశదముగ చిత్రించెను. హర్షుని ప్రియ గజము దర్పశతను గురించి వర్ణించుచు బాణుడు ఎన్నో పుటలను నింపెను. ఈ ఏనుగులు హర్షునిచే యుద్ధములో ఓడింపబడిన రాజులవద్దనుండి కప్పముగనో, కానుకలగనో వచ్చినవే. అతని అశ్వదళము వనాయూ, ఆరట్ట, కాంభోజ, భారద్వాజ, సింధు, ఇరాన్ దేశముల గుఱ్ఱములతో నిండియుండెను. ఈ బలమును సర్వవేళల యుద్ధమునకు సంసిద్ధముగా నుంచుటకు హర్షుడు పెద్ద సిబ్బందిని నియమించెను. వారిలో కాటుక, నాలివాహక, వల్లభపాల, అనాయత్త, హస్తి, పార్శ్వరక్షి, ఘటిక మొదలైన వారు కలరు.

# IV

## హర్షుని పరిపాలనము

ప్రాచీన పరిపాలనా పద్ధతిలో రాజుకే సర్వాధికారము లుండెడివి. అతని పేరున జరిగినదాని కంతయు అతడే న్యాయ సమ్మతమైన మధ్యవర్తి. క్రింది అధికారులకు నిర్దిష్టముగ నొప్పగించిన కొన్ని విషయములు తప్ప మిగిలిన పరిపాలనాధికార మంతయు అతని చేతులలోనే యుండెడిది. అతడే సర్వోచ్చ న్యాయాధికారి. పన్ను వసూళ్ళ శాసనములను, వాటి అపవాదములను కూడ అతడే నిర్ణయించుచుండెడివాడు. అతడే గజ, తురగ, రథ, కాల్బల ముల చతురంగ సైన్యమునకు సర్వ సైన్యాధిపతి. అతడే మతాధిపతి, మత గురువు.

ఇంతటి కార్య భారమును వహించుటచే సహజముగ రాజు రాత్రింబవళ్ళు నిర్విరామముగ కృషి చేయుచుండెడి వాడు. హర్షుని దినచర్య మూడు భాగములుగ విభజింపబడి యుండె ననియు, అందొక భాగము పరిపాలనకు, మిగిలిన రెండు భాగములు ధార్మిక విషయములకు వినియోగింప బడుచుండెడి వనియు, హర్షుడు నిర్విరామముగ కృషి చేయుచుండెడి వాడనియు, యువాన్ చ్వాంగ్ సూచించెను. అనగా హర్షుడెల్లప్పుడు రాజ భవనములో నుండెడివాడని కాదు. అతడు రాజధానిని విడిచి తరచుగ పర్యటనలు చేసేడివాడు. "ఎల్లవేళల పురజనుల మేలు కొరకు పాటుపడుచు, వారిలో ఏమైన లోపములు కన్పించిన, సరిదిద్దుటకు యత్నించెడివాడ"ని యువాన్ చ్వాంగ్ నుడివెను. రాజ్యమంతట పర్యటనచేసి ప్రజల స్థితిగతులను గమనించెడి వాడు. ఈ పర్యటనలో అక్కడక్కడ మజిలీలు చేయుచు శిబిర ములలో నుండెడివాడు. వర్షాకాలములో మాత్రము పర్యటనలు

చేసెడివాడు కాడు. ఈ తాత్కాలిక శిబిరములు బౌద్ధ భిక్షువులకు బ్రాహ్మణులకు ఆశ్రయ స్థానములుగ నుండెడివి. నేరస్థులను శిక్షించి, సన్మార్గులను సత్కరించి, న్యాయ తులాదండమును సమానముగ నుంచుటయే హర్షుని ముఖ్యమైన ఉద్దేశ్యము. తొలిసారి యువాన్ చ్వాంగ్ హర్షుని కలిసికొనినపుడు, హర్షుడు తన రాజ్యములో పర్యటనలు చేయుచు, వంగదేశములో నొక చోట బసచేసి యుండెను. హర్షుడు రాజధానికి దూరముగ నున్న ప్రదేశములలో బస చేసెనని బన్స్ ఖేరా, మధుబన్ శాసనములు తెలుపుచున్నవి. దీనివలన హర్షుడు భోగలాలసుడు కాడని ఎల్లప్పుడు ప్రజల శ్రేయస్సు కొరకే పాటుపడెడి గొప్ప చక్రవర్తి యనియు యువాన్‌చ్వాంగ్ వివరించెనని మనకు తెలియుచున్నది.

హర్షుడే రీతిగ తన దినచర్యను మూడు భాగములుగ విభజించి నిర్విరామముగ కృషి చేయుచుండెడివాడో యువాన్ చ్వాంగ్ మనకు చక్కగ తెలియపరచెను. కార్యదీక్షాతత్పరుడై, హర్షుడు నిద్రాహారములను కూడా త్యజించెను. హర్షుని కార్య తత్పరతను గురించి బాణుడు కూడ విపులముగ వివరించెను. ఇంతకు పూర్వము చెప్పినట్లు, హర్షుడే బాణుని పిలిపించెను. బాణుని పై నొక నేరము మోపబడెను. దానికి సమాధానమియ్య వలసినదని హర్షుడడిగెను. అజరావతీ నదీ తీరమున ప్రవాసములో నున్న చక్రవర్తిని కలిసికొనుటకు బాణుడు పయనమయ్యెను. కాని, ప్రభువును సందర్శించుట అంత సులభమైన విషయము కాదు. ఎందువలననగా, అట్టి ప్రవాసములలో హర్షుని దర్శించుటకు ఎందరో వేచి యుండెడివారు. పరాజితులైన శత్రురాజులు, సామంతులు శిబిరముల నేర్పరుచుకొని రాజ దర్శనమునకై వేచి యుండుట బాణుడు తిలకించెను.[1] వారిలో కొంతమంది దిన మంతయు రాజ దర్శనమునకై వేచియుండిరి.

---

1 ప్రఖ్యాతానాం క్షితిభుజాం బహూన్ శిబిరసన్నివేశాన్ వీక్షమాణః

చిన్న రాజులతో నిండియున్న మూడు రాజసభలు దాటి నాల్గవ సభకు చేరి బాణుడు హర్షచక్రవర్తిని సందర్శించెను. చక్రవర్తి ప్రక్కనే మాళవ రాజకుమారుడాసీనుడై యుండెను.

బాణుని వర్ణనలలో కొంత అతిశయోక్తి యున్నను, హర్షుని తాత్కాలిక నివేశముల వర్ణనలు మిక్కిలి రమణీయముగను, ఆకర్షణీయముగను ఉన్నవి. నదీ తీరమున నెలకొల్పబడిన శిబిరములే ఇంత ఆకర్షణీయముగ నున్నపుడు, రాజప్రాసాదము ఇంకెంత వైభవోపేతముగ నుండెడిదో యూహించవచ్చును. బాణుడీ వైభవ వర్ణనను చేయకుండుట నిజముగ దురదృష్టమే యనవలయును. అతడు స్థాణేశ్వర రాజధానిని గురించి సామాన్యముగ వర్ణించుచు అది యొక వర్తక వ్యాపార కేంద్రమని, ఎల్లప్పుడు విపణ వీథులు క్రిక్కిరిసి యుండెడివనియు, రాజ భవనపు ప్రాకారములు ధవళకాంతులతో ధగధగ మెరియు చుండెడి వనియు వివరించెను.

హర్ష చక్రవర్తి వైభవమును గూర్చి వర్ణించుచు అతడు బంగారు తొట్టెలలో స్నానము చేయుచుండెడి వాడనియు, బ్రహ్మణులకు స్వర్ణపాత్రలు గాని, లేక రత్నాలు పొదిగిన పాత్రలు గాని దానము చేసెడి వాడనియు బాణుడుల్లేఖించెను. హర్షుని ముక్కాలి పీటలు కూడ బంగారపువే. చక్రవర్తి పర్యటనలలో కూడ ఈ అలంకరణ సామగ్రి యంతయు తరలి వెళ్ళుచుండెడిది.

ఏటేటను కప్పములు సరిగా చెల్లించు స్థానికాధిపతులకు హర్షుడు కొంత అధికారము నొసగెను. అతడు ఏర్పాటు చేయు సభలకు, సమావేశములకు వారందరు హాజరు కావలసిందే. తమకు తాము సర్వ స్వతంత్రులమనెడి అభిప్రాయము నుద్భవించ కుండుటకే హర్షుడు ఈ నిబంధనలు చేసెను. కేంద్రీయ పరి పాలనా దక్షతకు ఇది యొక తార్కాణము. సానికాధిపతులకు కొన్ని రంగములలో స్వేచ్ఛాధికారము లొసగినను, కేంద్ర

ప్రభుత్వము నిర్బలమైనదని గాని, లేక సామంతులు తమ ఇచ్ఛ వచ్చినట్లు చేయుటకు స్వతంత్రులమనెడి భావము వారిలో తలెత్తుట కవకాశముండెడిది కాదు. హర్షుడిట్టి రాజసభలను, సమావేశ ములను ఎల్లప్పుడు జరుపుచుండెడి వాడు. ఒక ధార్మిక సమ్మేళన మునకు పదునెనిమిది సామంత రాజులు, వల్లభిరాజు, కామరూప రాజుకూడ హాజరైనట్లు యువాన్ చ్వాంగ్ వివరించెను. వల్లభి కామరూప రాజు లిద్దరు హర్షునితో స్నేహ సంబంధము నేర్పరచు కొనిరి. సానికాధిపతులను లేక, సరిహద్దు ప్రాంతములలో నియమింపబడిన ఈ ప్రతినిధి పాలకులను గూర్చి, బాణుడు తన హర్ష చరితములో ఈ విధముగ వ్యాఖ్యానించెను.[1] "ప్రజా సంరక్షకుడైన హర్షుడు రాజ్యమునకు నలు దిశల సంరక్షకులను నియమించెను. రాజధానిలో ఎందరో ప్రధానోద్యోగులుండెడి వారు. వారిలో ప్రధానుడు ముఖ్యమంత్రి. అతడే మంత్రి వర్గ మునకు నాయకుడు. భండి రాజ్యవర్ధన రాజుకు ముఖ్య సలహా దారుడుగ నుండెను. గౌడరాజుచే వధింపబడిన రాజ్యవర్ధనుని మరణవార్త వినగానే అతడీ సలహాదారుల సభను సమావేశ పరచినట్లు బాణుడు పేర్కొనెను. ఆ సభలో భండి ఈ విధముగ ఉపన్యసించెనట :

"ఈ రాజ్యము యొక్క భాగ్య నిర్ణయము చేయవలసిన ఘడియ తారసిల్లినది. వృద్ధరాజు, అతని కొమరుడు స్వర్గస్థు లైరి. రాజ్యవర్ధనుని సోదరుడు ప్రేమ వాత్సల్యములు కలవాడు. స్వభావ సిద్ధముగ శ్రద్ధాభక్తులు, వినయ విధేయతలు కలిగిన వ్యక్తి హర్షుడు ప్రజా విశ్వాసమును చూరగొన్న వ్యక్తి. అందు వలన అతడే రాజ్య భారమును వహించవలెనని నా ప్రతిపాదన. కాని ఈ విషయమును గూర్చి అందరును తమ తమ అభిప్రాయ ములు తెలుపగలరు."

---

1 అత్ర లోకనాథేన దిశాం ముఖేషు పరికల్పితా లోకపాలాః

ఆ రోజులలో కూడ ప్రజా ప్రతినిధుల చేతులలో ఎంత సిసలైన అధికారముండెడిదో నిరూపించు ఈ ప్రసంగమును బ్రిటిషు ప్రధాన మంత్రికి తెలియజేయుట అవశ్యకము. దీనివలన హర్షుడు, అతని పూర్వీకులు పాలించిన రాజ్యము, సంఘము ఎంతటి పురోగామియో, తేట తెల్లమగుచున్నది. మంత్రులందరు తమ తమ అభిప్రాయములను నిస్సంకోచముగ వెలిబుచ్చి ఏకగ్రీవముగ హర్షుని సింహాసనము నధిష్ఠించ వలసినదిగ ప్రార్థించిరి. భండియే కాక, బాణుడు కూడ హర్షుని సైన్యాధిపతి అవంతి యని పేర్కొనెను. సింహానాదుడు సర్వ సేనాధిపతి. రాజు సింహనాదుని మిక్కిలి గౌరవించెడివాడు. ఎందుకనగా అతడు ప్రభాకరవర్ధన మహారాజు విశ్వాసపాత్రులలో నొకడు. గౌడరాజుపై పగ తీర్చు కొనెదనని ప్రతిజ్ఞ చేసినపుడు, హర్షుడు, ముందుగ సింహానాదుని పాదములను స్పృశించెనని బాణుడు వ్రాసెను. కుంతలుడు అశ్వ దళాధిపతి యనియు, స్కందగుప్తుడు గజ దళాధిపతి యనియు కూడా బాణుడు పేర్కొనెను.

ఇంకెందరో అధికారులుండెడి వారు. వారు వేర్వేరు కర్తవ్య ములను నిర్వహించు చుండెడివారు.

1. మహాసంధి నిగ్రహాధికారి: ఇంతకు మునుపు చెప్పినట్లు హర్షుని పరిపాలనలో, అవంతి ఈ పదవిని నిర్వహించెను.
2. కటుకుడు లేక గజదళాధిపతి. ఈ పదవిని స్కందగుప్తుడు నిర్వహించెను.
3. మహా బలాధికృతుడు.
4. బలాధికృతుడు.
5. అశ్వదళాధిపతి (బృహదశ్వవారుడు)
6. సైన్య శిబిర నిరీక్షకుడు (పాఠపతి)

7. విదేశ వ్యవహారాల శాఖాధికారి (రాజస్థానీయుడు)

8. ప్రాంతీయ పరిపాలనాధికారి (ఉపరికుడు)

9. జిల్లా అధికారి (విషయపతి)

10. న్యాయాధిపతి (ప్రమాత్రి)

11. రెవిన్యూ అధికారి లేక తహసీల్‌దారు (భోగికుడు లేక భోగపతి)

ఈ విధముగ నెందరో ప్రత్యేకాధికారు లుండెడివారు. రాజ్యాంగ నిర్మాణమున ఈ విధముగ కొన్ని విభజనలు చేసి దానిని, సంస్కరించి హర్షుడు చక్కని రాజ వ్యవస్థ నేర్పరచెను.

సామ్రాజ్యమును కొన్ని మండలములగను, అనేకములగు చిన్న చిన్న భాగములగను విభజించెనని హర్షుని కాలము నాటి శాసనముల వలన మనకు తెలియుచున్నది.

1. రాష్ట్రము లేక మండలము (భుక్తి). మధూబన్ శాసనము శ్రావస్తిని సూచించెను. భుక్తి లేక శ్రావస్తి రాష్ట్రము.

2. అందలి యొక చిన్న భాగము జిల్లాగా పరిగణింపబడెను. (విషయము). మధుబన్ శాసనములో కుండదని విషయము పేర్కొనబడినది.

3. దానికంటె చిన్న ప్రదేశము, నేటి తహశీలు లేక తాలూకా లాంటి దానిని, పథకమనెడి వారు.

4. అన్నిటికంటె చిన్న భాగము గ్రామము.

యువాన్‌చ్వాంగ్ హర్షుని పరిపాలనను గూర్చి తన అభిప్రాయ మును ఇట్లు వెలిబుచ్చెను: "పాలకులు ఉదార స్వభావులగుటచే అధికారుల అవసరములు చాల తక్కువగ నుండెడివి. కుటుంబముల వివరములు సేకరింపబడెడివి కావు. నిర్బంధ పరిశ్రమ అమలులో లేదు. పన్నుల భారము తక్కువ. ప్రతి వ్యక్తియు వంశ పారం

పర్యముగ వచ్చు వృత్తులను చేయుచు పిత్రార్జితమును భద్రపరచు కొనెడివారు. ప్రభుత్వాదాయమునకు పారం పర్యముగ వచ్చు ముఖ్యాధారము పంటలోని అరవ భాగము, పడవల రేవులవద్ద, వ్యాపార కేంద్రముల సరిహద్దులలోను వసూలగు సుంకములు మొదలైనవి. 'తుల్యమేయ' మనెడి మరొక పన్ను ఉండెడిది. అది సరకుల కొలతల పైనను, తూకముల పైనను ఆధారపడి యుండెడిది. భాగ భోగకర నిరణ్యాది యనెడి మరొక పన్ను ఉండెడిది. అనగా పంటలోని కొంతభాగము, లేక రొక్కము గాని వేరే విధమైన ఆదాయము పైన గాని విధింపబడెడి పన్ను. బహుశ ఇది యొక రకమైన అమ్మకపు పన్ను లేదా ఆస్తి మార కపు పన్ను అయి యుండవచ్చును.

హర్షుని వ్యయ పద్ధతి కూడ క్రమమైనదే. ఆ కాలములో ప్రభుత్వ వ్యయము హెచ్చుగ నుండెడిది కాదు. హర్షుడు తన వ్యయ పట్టికను నాలుగు ముఖ్యాంశములుగ విభజించెనని యువాన్ చ్వాంగ్ వ్రాసెను. ఒక భాగము పరిపాలనా వ్యయమునకు, రాజ పూజలకు, రెండవభాగము అధికారుల వేతనములకు, మూడవ భాగము పండితులు, కవులు, శిల్పులు మొదలగు కళాకారులను సత్కరించుటకు, మత విషయములలో పాండిత్యమును పొందిన విభిన్న మతస్థులకు బహుమతుల నొసగుటకు వినియోగింప బడెడిది. ఈ వ్యయవిధాన క్రమమును చూచి ఎవరైనను అచ్చెరు వొందెదరు. ప్రజారక్షణ, ప్రజాసేవ, ప్రజల భౌతిక, ఆధ్యాత్మిక ఉన్నతిని పరమ ధర్మములుగ భావించి హర్షుడు రాజ్యమేలు చుండెననుటకు ఇది యొక చక్కని తార్కాణము.

శిక్షలేరీతిగ విధింపబడెడివో వివరముగ మనకు తెలియవు. అయినను హర్షుని పరిపాలనా దక్షతను గురించి యువాన్ చ్వాంగ్ ఇట్లు వ్రాసెను. "పరిపాలన న్యాయముగ సాగుచుండెడిది. ప్రజలు అన్యోన్యముగా ఉండెడివారు. నేరస్థుల సంఖ్య అతి

స్వల్పము.'' ఈ విధముగ వ్రాసినను స్వయముగా యువాన్ చ్వాంగ్ ఎందరో దుండగీడులను, దొంగలను ఎదుర్కొనవలసి వచ్చెను. ఒక పర్యాయము దుండగీడులు అతనిని నరబలి ఇచ్చుటకై ఎత్తుకు పోయిరి. కాని అదృష్టవశమున అతడు బ్రతికి బయటబడెను.

యువాన్ చ్వాంగ్ ఎంత వక్కాణించి వ్రాసినను ఆ కాలములో నేరములు బొత్తిగ లేవని చెప్పుటకు వీలుపడదు. నేరముల సంఖ్య మాత్రము అతి స్వల్పమేనని మన మూహించవచ్చును. ప్రజలలో పాపభీతి, దైవభీతి ఎక్కువగానుండెడిది. అందువలన వారు నేరములు చేయుటకు భయపడుచుండెడివారు. అట్లు చేసినచో ముందు జన్మలో నరకబాధ ననుభవించెద మనెడి భీతియు, నేరస్థులకు ఆ కాలములో విధింపబడు కఠినశిక్షలు నిరోధకములుగ నుండెడివి. ఈ సందర్భమును పురస్కరించుకొని యువాన్ చ్వాంగ్ భారతీయుల ప్రవర్తనను వేనోళ్ళ కొనియాడెను. ''భారతీయులు పరులసొమ్మున కాసపడరు. తీసికొనిన దానికి మరింత అధికముగనే ముట్ట చెప్పెదరు. ఈ జన్మలో చేయు పాపములకు మరుజన్మలో తప్పక శిక్ష ననుభవించి తీరెదమనెడి విశ్వాసము వారిలో ప్రబలి యుండెను. మోసము చేయుట యనునది వారెరుగరు. ఇచ్చిన వాగ్దానములను పాటించెడివారు.'' ఆధునిక కాలములో నైతిక విలువలు మారుటవలన నేరస్థులను, అపరాధులను శిక్షించుటకు బదులు, సంస్కరించుటయే శ్రేయస్కరమని భావించబడుచున్నది. కనుక నేరస్థులను శిక్షించుటకు గాక అతనితో పాటు ఇతరులకు కూడ గుణపాఠము చెప్పుటకే శిక్ష విధించబడినది. కాని, యూరోప్‌లోని మధ్యయుగములోవలె, హర్షుని కాలములో కూడ సామాన్యమైన నేరములకు, చట్ట భంగములకు ఆజీవన శిక్షలు విధింపబడుచుండెడివి. ఇంతియే గాక, కఠినశిక్షను విధించి ముక్కునో, చెవినో, చేతినో కోసివేయుట

కూడ కద్దు. నేడు మనకు అతి స్వల్పములగు నేరములుగ కానబడు వాటికి కూడ హర్షుని కాలములో నేరస్థులు రాజ్యమునుండి బహిష్కరింపబడెడివారు. కాని ఉత్సవ సమయములందు, పర్వ దినములందు ఖైదీలందరిని విడుదల చేయుటకు ఉత్తరువులు జారీచేయబడెడివి. మహారాజు యొక్క రెండవ కుమారుని జన్మదినోత్సవ సందర్భమున ఖైదీలందరు విడుదల చేయబడినట్లు, ఆ ఖైదీలగడ్డములు దట్టముగ పెరిగి, గతించిన కలియుగమునకు చెందిన వారేమో యనునట్లుండిరని బాణుడు వర్ణించెను. (ప్రలంబశ్మశ్రుజాలజటిలాననాని బహలమలపంకకళంక కాలకాయాని నశ్యతః కలికాలస్య బాంధవకులానీవాకులాని అధావంతముక్తాని బంధన వృందాని.)

శిక్షలు, జరిమానాల రూపములో కూడా విధింపబడెడివి. నేరస్థుల నేరములను గాని, నిర్దోషిత్వమును గాని నిర్ణయించుటకు మరియొక పద్ధతి ప్రచారములో నుండెను. నేరస్థులు తమ నిర్దోషిత్వమును నిరూపించుటకు స్వయముగ నేదైన ఒక శిక్షకు లోబడెడివారు. సతీ సహగమనము (స్త్రీ తన భర్త చితిలోకి దూకి ప్రాణముల నర్పించుట) ఆ కాలములో ప్రబలియుండెను. భర్తను కోల్పోయిన తరువాత మరి ఏ కోరికలులేని స్త్రీ తన భర్త చితిలో దూకుటయే ఉత్తమ మార్గముగ భావించెడిది. ప్రభాకరవర్ధనుని మరణాంతరము రాణి యశోమతి ఇట్లే సతియయ్యెను. హర్షుని సోదరి రాజ్యశ్రీ కూడ నిరాశ చెంది, ఈ విధముగనే సహగమనము చేయ బూనినపుడు హఠాత్తుగా హర్షుడు ఆమెను రక్షించెను. రాజ్యవర్ధనుడు బహుశ అవివాహితుడు. అతని భార్య సహగమనమును చేసినట్లు ఎక్కడను పేర్కొనబడలేదు.

ఆ కాలములో కూడ, హర్షుని విశాల సామ్రాజ్యములో పెద్ద పెద్ద పట్టణములు, నగరములు, గ్రామములు ఉండెడివి. రాజధాని అన్నిటికంటె సమృద్ధిగను, వైభవోపేతముగను

ఉండెడిది. అయినను పెద్ద పెద్ద నగరములలో కూడ వీధులు సందులన్నియు మెలికలు తిరిగి వంకర టింకరగా నుండెడివనియు ముఖ్య వీధులు కూడా మురికిగా నుండెడివనియు యువాన్ చ్వాంగ్ వ్రాతల వలన తెలియుచున్నది.

హర్షుడు తన రాజధానిని స్థాణేశ్వరమునుండి కాన్యకుబ్జము నకు మార్చిన తరువాత అది అతని విశాల సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణ మగుటయేగాక, దేశమంతట మిక్కిలి ప్రసిద్ధి చెందెను. ఆ కాలములో కాన్యకుబ్జము అనేక సాంస్కృతిక, ధార్మిక, విద్యా కార్యకలాపములకు కేంద్రస్థానమయ్యెను. మగధ రాజధానియైన పాటలీపుత్రమును గూడా మించిపోయెను. కాన్యకుబ్జము 5 మైళ్ళు పొడవు $1\frac{1}{4}$ మైళ్ళు వెడల్పుగల విశాల నగ రము. నాటి పద్ధతి ననుసరించి నగరమునకు నలువైపుల ఎత్తైన ప్రాకారములుండెను. నగరములో అందమైన ఉద్యానవనములు, పరిశుభ్రమైన నీటితో నిండిన కొలనులు ఉండెడివి. కాన్యకుబ్జము, పాటలీపుత్రమే గాక మరికొన్ని నగరములు కూడ ఆ కాలములో ప్రసిద్ధికెక్కినవి. వారణాసి చిరకాలముగ హిందూ ధర్మమునకు, భారతీయ సంస్కృతికి పట్టుకొమ్మ అయినను తన బౌద్ధధర్మ పక్షపాతము వలన ఈ నగరము నాస్తికులకు ఆలవాలమైయుండె నని యువాన్ చ్వాంగ్ వెలిబుచ్చెను. ఏడవ శతాబ్దములో కూడ నేటివలె, వారణాసి నగరమంతయు దేవాలయములతో విలసిల్లి యుండెడిది. శిల్ప సంపదలతో, నగిషీలతో నలరారు మండ పములు మిక్కిలి ఆకర్షణీయముగ నుండెడివి. గుప్తరాజుల రాజ ధానియైన ఉజ్జయిని నగరము యొక ప్రసిద్ధి విద్యాకేంద్రముగ నుండెను. ఆ నగరములో ఆ కాలములో నిర్మింపబడిన "జంతర్ మంతర్" ఇప్పటికి ఆకర్షణీయముగ నుండి ప్రసిద్ధిబడసినది. నగరములో అద్భుతమైన రాజభవనము లుండెడివి. మహాకవి కాళిదాసు, తన మేఘ సందేశమనెడి కావ్యములో యక్షుని ముఖ

మున నిట్లు పలికించెను.[1] "ఓ మేఘమాలికా! ఉత్తరదిశగా నీవు పయనమగు చున్నను, ఉజ్జయిని నీ మార్గమధ్యమున లేకున్నను, ఆ మహానగరమును నీవు తప్పక తిలకించుము." హర్షుని కాలములో కూడా నిస్సందేహముగ నిదియొక మహానగరమై వర్ధిల్లెను. మధురానగరము మరియొక ప్రసిద్ధ నగరము. కృష్ణుని బాల్యలీలను నిండు కళ్ళతో చూచిన ఈ నగరము కొంతకాలమునకు బౌద్ధనగరమాయెను. యువాన్ చ్వాంగ్ ఇంకను ఎన్నో నగరములను పేర్కొనెను. దక్షిణదేశములో ప్రసిద్ధి గాంచిన నగరములలో కంచి యొకటి.

యువాన్ చ్వాంగ్ కాన్యకుబ్జ నగరమును గూర్చి విపులముగ వర్ణించెను. కనోజ్ లేక కన్యాకుబ్జపు చుట్టుకొలత 4000. లీలని అతడు వ్రాసెను. అది నలువైపుల దుర్భేద్యముగ నుండి, అందమైన కట్టడములతో నలరారు చుండెనని కూడ వ్రాసెను. పూలతోటలు, నిర్మలమైన తటాకములతో నగరము శోభాయమానముగ నుండెడిది. వివిధ దేశములనుండి సేకరింపబడిన విచిత్రవస్తువులు అందందు ప్రదర్శింప బడెడివి. ప్రజలు సుఖ సంతోషములతో తమ జీవితమును గడుపుచుండెడివారు. అనేక కుటుంబములు ఐశ్వర్యముతో తులతూగుచుండెడివి. పండ్లు, పువ్వులు పుష్కలముగా లభించెడివి. ఉత్సవములు, కోతలు సకాలములో జరుగుచుండెడివి. ప్రజలు మంచి నాగరికత గలవారై, పట్టువస్త్రములను ధరించెడివారు. పెక్కు విద్యలను, కళలను అభ్యసించుచుండెడివారు. అనవరతము తర్కశాస్త్ర చర్చలు జరుగు చుండెడివి. ప్రజలలో కొందరు ప్రాచీన సంప్రదాయములను కొనియాడెడివారు, మరికొందరు నూతన భావములకు నీరాజనము లొసగెడివారు. దాదాపు నూరు బౌద్ధవిహారము లుండెడివి.

---

[1] వక్రః పంథా యదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం సౌధోత్సంగ ప్రణయ విముఖో మా స్మ భూరుజ్జయిన్యాః

వాటన్నిటిలో మొత్తము పదివేల మంది విద్యార్థులుండెడివారు. వారిలో కొందరు హీనయాన శాఖకు, కొందరు మహాయాన శాఖకు చెందియుండెడివారు. రెండు వందల దేవాలయము లుండెడివి. కాని బౌద్ధులు వారిసంఖ్య వేలలో నుండెడిది. యువాన్ చ్వాంగ్ తన యాత్రలలో చూచిన నగరములన్నిటిని చక్కగ చిత్రించెను. ఆ నగరములలో పెద్ద పెద్ద సౌధములు, విశాలమైన చావడులతో, అందమైన అంతస్థులతో రమణీయముగ నుండెడివి. అవి వెల్లవేయ బడి ధవళకాంతితో మెరయు పెంకుటిళ్ళు మిక్కిలి ఎత్తైనటు వంటివి. సామాన్యుల ఇళ్ళు ఇటుకలతోను మట్టితో నిర్మింప బడెడివి. నేలను అవుపేడతో అలుకుచుండెడివారు. (నేటికిని గ్రామములలో ఇండ్లను నునుపుగాను, పరిశుభ్రముగా నుంచుటకు అవుపేడతో అలుకుచుందురు). మొత్తముమీద సామాన్య ప్రజల నివాసములు కూడ సౌకర్యములన్నియు కలిగియుండెడివి. బయ టకు నిరాడంబరముగ కన్పించుచున్నను లోపల అన్ని వసతు లతో నుండెడివి. రాజ్యశ్రీ వివాహ సందర్భమున రాజభవనము ఎన్నో చిత్రవిచిత్రమైన వస్తువులతో, చిత్రములతో నందముగ నలంకరింపబడెనని వందలాదిగ పనివాండ్రు కుంచెలు, రంగులు చేబూని నిచ్చెనలపైనెక్కి గోడలకు సున్నములు వేసి రంగు రంగుల చిత్రములతో నలంకరించిరని హర్ష చరితములో కూడ సూచింపబడెను.[1]

కాన్యకుబ్జ నగరవాసుల గురించి యువాన్ చ్వాంగ్ ఈ విధ ముగ వ్రాసెను. "వారి భాష స్పష్టముగను, స్వచ్ఛముగ నుండె డిది. వారి అభివ్యక్తి, శైలి రమ్యముగ మృదు మధురముగ నుండి దేవతల ఉచ్చారణవలె తేనెలొలుకుచు ఇతరులకు ఆదర్శ ప్రాయముగ నుండెడిది."

---

1 ఉత్కూర్చకరైశ్చ సుధాకర్కరస్కంధైః అధిరోహిణీసమారూఢైః ధవలైః ధవళీ క్రియమాణప్రాసాదప్రతోలీ ప్రాకారశిఖరమ్.

హర్షుడు ఉత్తర హిందూ దేశమంతటను కడు సమర్థతతో పరిపాలించెనని మనము తెలిసికొంటిమి. యువాన్ చ్వాంగ్ హర్షుని ఆస్థానమును సందర్శించినపుడు రాజ్యమంతట శాంతి నెలకొల్పబడి యుండెను. అంతటి విశాల సామ్రాజ్యములో శాంతి భద్రతలను నెలకొల్పుట సామాన్యమైన విషయము కాదు. చక్కటి పరిపాలనా వ్యవస్థ లేనిదే ఇది సమకూరదు. కేవలము మహానగరములలోను, పట్టణములలోను గానవచ్చు వైభవ సంపదలు పరిపాలనా దక్షతకు నిదర్శనములు కావు. మారుమూలల నున్న చిన్న చిన్న గ్రామములను, పల్లెలను పరిశీలించిన గాని మనకు అసలు విషయము తెలియదు. హర్షుడు పరిపాలనా దక్షుడు, రాజ్యాంగములోని బాగోగులు, లోటుపాటులు అతనికి పూర్తిగ తెలియును. పాలకులకు పాలితులకును అవినాభావ సంబంధమున్నదని అతడు బాగుగ గ్రహించెను. ఈ సంబంధము కేవలము మంత్రుల సలహాపైనగాని అధికారుల అభిప్రాయములపైన గాని ఆధారపడియుండరాదు. పాలకుల, పాలితుల మధ్య వ్యక్తిగత సంబంధ ముండవలయును. అదియే సుపరిపాలనకు పునాది. రాజు స్వయముగ గ్రామ గ్రామమునకు వెళ్ళి ప్రజల కష్ట సుఖములను తెలిసికొనిన నాడే అతడు ప్రజా హృదయముల చూరగొన గల్గును. బాణుడు గాని, యువాన్ చ్వాంగ్ గాని హర్షుని గ్రామ పరిపాలనా వ్యవస్థను గూర్చి వ్రాయలేదు. కాని హర్ష చరితములో మనకీ వ్యవస్థను గూర్చి కొంతవరకు తెలియవచ్చుచున్నది.

ప్రస్తుతము మన రెవెన్యూ పరిపాలనా పద్ధతి చాలావరకు బ్రిటిషు వ్యవస్థపై నాధారపడి యున్నది. గ్రామ జీవితమును గూర్చి పూర్తి వివరములను సేకరించు పద్ధతి అమలునకు వచ్చినది. నెలవారిగా గ్రామకరణములు, మునసబులు అనేక గ్రామపట్టీలను తయారుచేయుదురు. వీటన్నిటిని అప్పుడప్పుడు ఉన్నతోద్యోగులు

తనిఖీ చేయుదురు. కలెక్టరు జిల్లాలోని గ్రామముల జాబితాలు ప్రోగుచేయును. హర్షుని పరిపాలనలో కూడా ఈ విధమైన వివరములు సేకరింపబడుచుండెడివి. దస్తావేజులు, పాత వ్రాత ప్రతులకై వేరుగ నొక శాఖయుండెడిది. రాజు గ్రామ మధ్యముగ పోవునపుడు మునసబు (అక్షపటలికుడు) కరణములు రాజుకు మ్రొక్కి "మహాప్రభూ, మీ ఆజ్ఞకు వేచి యుంటి" మని ఎంత వేడుకొనెడివారో బాణుడు విశదముగ వివరించెను. అట్లు విన్నవించుకొనిన తరువాత అక్షపటలికుడు బంగారు ముద్రికను తెచ్చి రాజశాసనము దానిపై యధోచితముగ ముద్రించెడివాడు.

ప్రజాస్వామ్యము ఆ కాలములో ప్రాథమిక దశలో నున్నను ఎంత ఉన్నతస్థాయి నందినదో ఇంతకు పూర్వమే చెప్పబడినది. హర్షుని సింహాసనము నధిష్ఠించుమని ప్రేరేపించిన వారు అధిష్ఠాన వర్గమునకు చెందిన మంత్రులు, సలహాదారులు. మొదటి మెట్టులో కూడ పరిపాలన ఒక విధముగ ప్రజా స్వామ్యాత్మకముగనే యుండెడిది. ఒక కార్య నిర్వాహకుడుండెడివాడు. అతనికి సలహానొసగుటకు కార్యవర్గ ముండెడిది. ఈ కార్య నిర్వాహకుడు విషయపతి అని పిలువబడెడి వాడు. అతని అధికారములో నున్న భూభాగము యొక్క వైశాల్యము ననుసరించి ఒక పురపాలక అధ్యక్షుడు, ఒక వర్తక వ్యాపార ప్రతినిధి, కళాకారులకొక ప్రతినిధి, రచయితలకు, గ్రంథకర్తలకు మరియొక ప్రతినిధి యుండెడివారు. ఈ ప్రతినిధుల సమక్షములో హర్షుడు బ్రాహ్మణులకు కానుకలు, దానములిచ్చెడివాడని మధూబన్ శాసనమువల్ల తెలియుచున్నది. !

కొంత కాలమున కొకసారి జనాభా లెక్కలు తయారగుచుండెడివి. హర్షుని ఆదేశానుసారము ఇవి జరిగెడివని చెప్పుటకు సరియైన ప్రమాణము లేవియు లేకున్నను అతని సమకాలికుడు శత్రువు అయిన గొప్ప మహారాష్ట్ర చక్రవర్తి, రెండవ పులకేశి

తన సామ్రాజ్యమును మూడు భాగములుగ విభజించెననియు, ఒక్కొక్క భాగములో తొంబది తొమ్మిది వేల గ్రామములుండెడి వని తెలియుచున్నది.

రాజ ముద్రల ప్రసక్తి ముందుగనే చెప్పబడినది. కొన్ని విచ్ఛిన్నావస్థలోనున్న ముద్రలు లభించినవి. వాటిపై నున్న లిపి స్పష్టముగా లేకున్నను, కొన్ని ముద్రలలో హర్షుడు మహారాజాధిరాజనియు, దైవాంశ సంభూతుడనియు, మహాభట్టారకుడనియు పేర్కొనబడెను. అందలి ప్రతి అక్షరము స్పష్టముగ లేకున్నను, లోపించిన అక్షరములను తేలికగ ఊహించుకొని ఈ విధముగ మనము చదవవచ్చును: (పరమ) మహేశ్వరః ఏవసార్వ (భౌమః) పరమ (భ) ట్టారకః మహా రాజాధిరాజ శ్రీ హర్షః (బ్రాకట్లలో చూపించిన అక్షరములు లోపించినవి.)

హర్షుని కాలములో నాణెములు కూడ చలామణియగు చుండెననుటకు తగిన యాధారములు కలవు. హర్ష యుగమునకు పూర్వపు నాణెములు, హరుని కాలము నాటి నాణెములు లభించినవి. 'ప్రతాపశాల' అను పేరుతో నొప్పు తొమ్మిది నాణెములు దొరకినవి. శిలాదిత్యుని పేరుతోను హర్షుని పేరుతోను వెలువడిన నాణెములు కూడా దొరకినవి. అందొక నాణెము మీద ఈ విధముగ ముద్రింపబడెను: విజేత శ్రీ శిలాదిత్యుడు అఖిల విశ్వమునకు అధినేత యగుచు స్వర్గమును కూడ జయించును. (విజయతాం అవనిపతిః శ్రీ శిలాదిత్యో దివం జయతి)

స్త్రీ పురుషుల వస్త్రధారణను గురించిన వర్ణనలు కూడ గలవు. పురుషుల దుస్తులను గూర్చి యువాన్‌చ్వాంగ్ ఈ విధముగ వర్ణించెను. పురుషులు నడుము చుట్టూ త్రిప్పి భుజములవరకు వస్త్రములు ధరించెడివారు. కుడి భుజమును వదిలి వేసెడి వారు. స్త్రీలు చీరలు ధరించి రెండు భుజములను కప్పుకొని క్రిందకు జారవిడిచెడి వారు. స్త్రీలు పరదా పద్ధతి నెరుగరు.

రాజ్యశ్రీ వివాహమునకు పూర్వము గాని, వివాహానంతరము గాని, లేక ఆమె వితంతువైన తరవాత గాని ముసుగు వేసికొనినట్లు బాణుడెందును సూచించలేదు. ఉత్తమ వంశములోని స్త్రీలు విద్య నభ్యసించెడివారు. రాజ్యశ్రీ పాఠశాలకుపోయి విద్యాధ్యయనము చేయనప్పటికిని బౌద్ధ సన్యాసియైన దివాకరమిత్రుని వద్ద ఆమె ఉపదేశములు పొందెనని బాణుడు వ్రాసెను. భర్తను గోల్పోయిన తరువాత సన్యాసినివలె కాషాయ వస్త్రములు ధరించుటకు రాజ్యశ్రీ నిశ్చయించుకొనెను. కాని హర్షుడు ఆమెను ఎంతగనో ప్రతిమాలెననియు, అదే విధముగ బౌద్ధ భిక్షువు కూడ ఓదార్చి నచ్చచెప్పెననియు తెలియుచున్నది. రాజ్యశ్రీ గొప్ప సంస్కారము కలిగిన స్త్రీ. కనుక వారి సలహాను పాటించినది. ఇంతియేగాక, రాజశ్రీ నృత్యసంగీతములను కూడ నభ్యసించెనని తొలి యధ్యాయమునందే బాణుడు నుడివెను. నాటి స్త్రీలు పెక్కు కళలలో పారంగతులైనటులు సమకాలిక సాహిత్యము వలన ఋజువగుచున్నది. బాణుని వేరొక ప్రసిద్ధ గ్రంథము కాదంబరిలోను, హర్షుడు రచించిన నాటకములలోను, పై అభిప్రాయమును బలపరచుటకు పెక్కు సాక్ష్యములు కలవు.

సామాన్యముగ కూడ విద్యా ప్రచారము విరివిగ జరుగుచుండెననుటకు కూడ తగు సాక్ష్యములు కలవు. ఒక దేశము విద్యా ప్రచారములో నున్నత స్థితిలో నున్నదని చెప్పుటకు సమకాలిక సంఘము పైననే గాక ముందుతరము వారిపైగూడ తమ ప్రభావ ముద్రలను వేయు కొద్దిమంది పండితులను గాని, రచయితలను గాని తయారుచేయుటయే గాదు. కాళిదాసువంటి మహాకవి భారతదేశము నందుద్భవించుట నిజముగ మహాదృష్టమే. శతాబ్దములగ నెందరో మహాకవులు ఈ దేశములో నుద్భవించిరి. నేటికిని విదేశములలో కూడ వీరి కీర్తికాంతులు వెలుగొందుచున్నవి. సుప్రసిద్ధ జర్మను వేదాంతి, మహాకవి గోథే, శాకుంత

లము చదివి ఆనందముతో పరవశుడై ప్రపంచములో సుందర వస్తు వేదేని యున్న దానిని 'శాకుంతల' మని పిలిచెదనని వక్కాణించెను. కాని పైన చెప్పినట్లు, భారతీయ సంస్కృతి యొక్క గౌరవము ఈ మహాకవుల పైననే ఆధారపడి యుండ లేదు. కాని హర్షుని కాలములో వలె వివిధ విద్యలను వెదజల్లు అనేక విశ్వ విద్యాలయముల స్థాపన వల్లనే భారతీయ సాంస్కృతిక వైభవము పరాకాష్ఠ నొందెను. ప్రాచీనకాలము నుండియు వేద, వేదాంగములు, ఉపనిషత్తులు, బ్రాహ్మణములు, సూత్రములు, భగవద్గీత మొదలగు నాధ్యాత్మిక గ్రంథములు అనివార్యముగ నభ్యసింప బడెడివి. కాని ఇట్టి విద్యాభ్యాసము కేవలము బ్రాహ్మణుల వరకే పరిమితమై యుండెడిది. బౌద్ధమత వ్యాప్తితో విద్యా ప్రచారము విస్తృతమై సంఘములోని నిమ్నవర్గములలో గూడ విరివిగ వ్యాపించెను.

బీహారులోని సుప్రసిద్ధ నలందా విశ్వ విద్యాలయము దీనికి తార్కాణము. దాని వైభవమును గూర్చి యువాన్‌చ్వాంగ్ ఇట్లు వర్ణించెను. ''విద్యార్థుల సంఖ్య వేలలో నుండెడిది. వారు మేధావులు, నిపుణులు. వారి ప్రజ్ఞ అమోఘమైనటువంటిది. వారిలో పెక్కుమంది ఖ్యాతి నలుదిశల వ్యాపించెను. వారి ప్రవర్తన నిష్కళంకమై నటువంటిది, వారు మనః పూర్వకముగ నైతిక సిద్ధాంతములను అనుసరించెడి వారు. మఠములలో, విహారము లలో కఠోర నియమము లుండెడివి. అందుండు భిక్షువులు, పురోహితులు అందరు వాటిని త్రికరణ శుద్ధిగ పాటించవలసినదే. రోజంతయు ప్రశ్నలు సమాధానములకే సరిపోయెడిది కాదు. ఉదయము నుంచి రాత్రి వరకు చర్చలు జరుగుచుండెడివి. ఆ చర్చలలో పెద్దలు, పిన్నలు పాల్గొని ఒకరికొకరు సహాయ పడు చుండెడి వారు. తర్కశాస్త్రములో పాండిత్యమును పొందగోరిన విద్వాంసులు అనేక నగరముల నుండి వందలాదిగ వచ్చి తమ

తమ సందేహములను నివారించుకొని జ్ఞాన స్రవంతులను నలు దిశల ప్రవహింప జేసెడి వారు. ఇందువలన కొందరు నలందా విశ్వవిద్యాలయము పేరు నుపయోగించుకొని, యాత్రలుచేసి గౌరవ ప్రతిష్ఠలను పొందెడివారు. ఈ విశ్వ విద్యాలయములో ప్రాచీన, ఆధునిక గ్రంథములను క్షుణ్ణముగ చదివిన వారికే ప్రవేశము లభించెడిది. అందువలన క్రొత్తగా వచ్చు విద్యార్థులు చర్చలలో పాల్గొని తమ యోగ్యతలను నిరూపించు కొనెడివారు. ఉత్తీర్ణులు పది మంది ఉన్నచో అనుత్తీర్ణులు ఏడెనిమిదిమంది ఉండెడి వారు. వారిలో అసాధారణ ప్రతిభావంతులు, ప్రజ్ఞావంతులైన వారు ధమ్మపాలుడు లేక చంద్రపాలుడు, గుణమతి, స్థిరమతి. నేటికిని వీరి ఉపదేశములు విదేశీయులలో కూడ బహుళ ప్రచార ములో నున్నవి. ప్రభామిత్రుడు తన నిశితతర్క బుద్ధికి, జీన మిత్రుడు తన అనర్గళమైన ఉపన్యాస ధోరణికి, విఖ్యాతినొందిరి. ఇంకను కాలగర్భములో విలీనమైపోయిన పెక్కు మహనీయు లలో శీల భద్రుని వంటి వారెందరో కలరు.

ఈ విశ్వ విద్యాలయ ప్రసక్తి యువాన్‌చ్వాంగ్ యాత్రా వివర ములలోనే గాక అతని జీవిత చరిత్రలో కూడ కలదు. ఈ విశ్వ విద్యాలయము శక్రాదిత్యునిచే స్థాపింపబడెను. తదుపరి అనేక మంది రాజులు ఆ నాటి మేటి శిల్పులను బిలిపించి విశ్వ విద్యాలయ భవన నిర్మాణము గావించిరి. తుదకు ఈ విశ్వవిద్యాలయ మొక అద్భుత రూపమును దాల్చెను. దాని ఆదాయము కూడ వృద్ధి చెందెను. హర్షుని కాలములో దీనికి రెండు వందల గ్రామముల రాబడి గలదు.

భారతదేశములోని వివిధ ప్రాంతముల నుండియే గాక విదేశముల నుండి కూడ అనేకమంది విద్యార్థులు ఈ విశ్వ విద్యాలయములో విద్య నభ్యసించెడి వారు. యదార్థమునకు, హర్షుని కాలములో భారతావని ప్రపంచములో నొక ముఖ్య విద్యా

కేంద్రముగ పేరుగాంచెను. ఈ విశ్వ విద్యాలయమునకు శీలభద్రుడు కులపతిగా నున్నపుడు యువాన్ చ్వాంగ్ విద్యార్థిగ ప్రవేశించుటకు నిశ్చయించుకొనెను. "బాలురను ప్రారంభ దశలోనే ఆకర్షించుటకు 'సిద్ధవస్తు' అనెడి పన్నెండధ్యాయములు గల పుస్తకమును బోధించెడి వారు. ఏడేండ్ల వయస్సు రాగానే, వారికి పంచ విద్యలు నేర్పెడి వారు. వ్యాకరణము అందులో నొకటి. అందువలన వారికి వర్ణక్రమము, శబ్దార్థ భేదము బాగుగ బోధ పడెడిది. రెండవది వృత్తికి సంబంధించిన విద్య, తత్సంబంధమైన యంత్ర కళలు, జ్యోతిష్యము, విజ్ఞానము మొదలైనవి. మూడవది చికిత్సా శాస్త్రము. నాల్గవది తర్క శాస్త్రము. అయిదవది ఆత్మ జ్ఞానము.

హర్షుని రాజనీతిజ్ఞత అందరికి తెలిసినదే. పరాజితులైన శత్రు రాజులందరు, లేక స్వయముగ అతని సార్వభౌమత్వమును అంగీకరించిన రాజులు, నయముననో భయముననో, హర్షునకు సామంతులుగ నుండిరి. హర్షుడు వారి పై తన పూర్ణాధిపత్యమును చలాయించుచు, వారికి కొంత స్థానిక స్వాతంత్ర్యము నిచ్చెను. పెక్కు విదేశములతో హర్షుడు రాజకీయ సంబంధములను ఏర్పరుచుకొనెను. ఒకానొక ద్విజుని చైనాదేశపు రాయబారిగ పంపిన విషయము ఇంతకు పూర్వమే చెప్పబడినది. రెండవ పులకేశి ద్వారా ఇదే విధముగ నియమింపబడిన రాయబారి నెదుర్కొనుటకే బహుశ హర్షుడిట్లు చేసి యుండవచ్చును. హర్షుడే విధముగ ఉత్తరా పథమునకు సార్వభౌముడో, దక్షిణాపథము కంతటికి అదే విధముగ రెండవ పులకేశి సార్వభౌముడు. రెండవ పులకేశి పర్షియా దేశముతో కూడ దౌత్య సంబంధములను స్థాపించు కొనెను. ఇట్టి మహనీయ చక్రవర్తులకు ప్రతినిధులైన ఈ ఇద్దరు రాయబారులు సముద్ర యాత్రలు చేసిరి. ఆ కాలములో సముద్ర యాత్రలు సాధారణముగ జరుగుచుండెడివి. భారతదేశము,

సింహళము మధ్య సముద్ర ప్రయాణములు విరివిగ జరిగెడివి. సింహళమునుండి కౌశాంబికి ప్రయాణము చేయునపుడు, ఓడ మునిగిపోవుట వలన నాయకురాలు పెక్కు బాధలకు గురియైనట్లు హర్షుని రత్నావళి నాటకములో నొక ప్రసక్తి గలదు. ఇంతకు రెండు శతాబ్దములముందే ఫాహియాన్ అను మరియొక చైనా యాత్రికుడు సముద్రము మీదుగ సింహళము, అక్కడనుండి జావా ద్వీపము, మరి అచటనుండి క్యాంగ్‌చౌ వెళ్ళినట్లు తెలియు చున్నది. అతడొక పెద్ద ఓడలో ప్రయాణము చేసెను. రెండు వందలమంది ప్రయాణీకులు సౌకర్యముగా దానిలో ప్రయాణము చేయవచ్చును. యువాన్‌చ్వాంగ్ భారతదేశములో దాదాపు పదిహేను సంవత్సరములుండెను. అతడు తిరిగి మనదేశమునకు బయలుదేరినపుడు సముద్రముమీదుగా ప్రయాణము చేయుటకు నిశ్చయించుకొనెను. అతనితో నొక రాయబారిని పంపుటకు హర్షుడు సంసిద్ధుడయ్యెను. దానివలన హర్షుని నౌకాబలము సముద్రయాత్రలలో ఆరితేరినదని మనకు తేటతెల్లమగుచున్నది. గుప్తరాజుల కాలములోకూడ, తూర్పు ఇండియా దీవులతో, సముద్రమార్గమున, మనదేశమునుండి వర్తక, వ్యాపారములు జరుగుచుండెడివి. అనేకవృత్తులు చేయువారు, అయిదువేల మందికి పైగా భారతీయులు, జావా ద్వీపమునకు వలసపోయి అక్కడనే స్థిరనివాస మేర్పరచుకొన్నట్లు మనకు రూఢిగ తెలియుచున్నది.

హర్షుని మరణాంతరము, 'ఈ–త్సింగ్' అను మరొక చైనా యాత్రికుడు భారత దేశమునకు వచ్చెను. అతడు సముద్ర మార్గముననే ఈ దేశమునకు వచ్చెను. మార్గ మధ్యమున అతడొక ఓడనుండి మరియొక ఓడకు మారి తుదకు నగ్నవాసుల ద్వీపమునకు (అండమాన్ ద్వీప సమూహము లోనిదై యుండ వచ్చు) చేరెను. అక్కడనుండి, పదిహేను రోజుల తరువాత తామ్రలిప్తి యనెడి రేవులో దిగెను. అతడు తన తిరుగు ప్రయా

ణపు వివరములను గూడ భద్రపరచెను. "తామ్రలిప్తినుండి బయలుదేరి రెండు నెలలు ఆగ్నేయముగ నౌకాయానము చేసిన తరువాత 'కా-చా' చేరుకొంటిమి" అని వ్రాసెను.

వర్తక వ్యాపారములకు దూర దేశములో వలసకు పోయి స్థిరనివాస మేర్పరుచు కొనుటయే గాక, ఆ యా దేశములతో సాంస్కృతిక సంబంధముల నేర్పరుచు కొనుటకు గూడ ఓడలు రాకపోకల కుపయోగపడు చుండెడివి. నేటికి ఆగ్నేయాసియా దేశములలో పెక్కు భారతీయ సంస్కృతీ చిహ్నములు గలవు. ఇవన్నియు ఇంచుమించుగ, ఏడవ శతాబ్దములో, అనగా హర్షుని కాలమునాటివే. భారతీయ కళలు, భారతీయ సంస్కృతి, భారత దేశములో జన్మించిన బౌద్ధ మతము విదేశములలో కూడ వ్యాపించెను. అందువలన హర్షుని యుగము భారతదేశ చరిత్రలో నొక స్వర్ణ యుగముగ పరిగణింపబడుటలో ఆశ్చర్య మేమియు లేదు.

# V

## హర్షుని మతము

హర్షుని కీర్తి ఉన్నత శిఖరముల నందుకొనిననాటికే అతడు బౌద్ధుడాయెను. హర్షుని మతమునుగూర్చి ఇదమిత్థముగ చెప్పుటకు రెండు ఆటంకములున్నవి. మొదటిది అతడు తన జీవితములో ఎప్పుడు బౌద్ధమతమును స్వీకరించెనో యనునది; రెండవది ఆ మతము యెడల అతని శ్రద్ధాభక్తు లెట్టివో యనునది. ఈ రెండిటి సమాధానములకొరకు యువాన్ చ్వాంగ్ వ్రాతలు మనకు కొంత సహాయపడగలవు. కాని యువాన్ చ్వాంగ్ స్వయముగ నొక ప్రగాఢ బౌద్ధమతావలంబి. మత పరిస్థితుల పరిశీలనార్థమై భారతదేశమునకు వచ్చిన చైనా యాత్రికుడు అతడు. సహజముగ బౌద్ధమతము యెడల అతనికి ఎక్కువ అభిమానము, పక్షపాతము ఉండును. ప్రతి విషయమును అతడు బౌద్ధ మతాభిమానుల దృష్టితోనే చూచియుండవచ్చును. ఉదాహరణార్థము, భారతీయ సంస్కృతికి చిరకాలముగ నాలవాలమైన వారణాసి నగరమును అతడు "నాస్తికుల నగరమని" ఉల్లేఖించెను. ప్రాచీన కాలము నుండి వారణాసి ఒక గొప్ప విద్యా కేంద్రమే గాక, బ్రాహ్మణ మతమునకు పట్టుకొమ్మగా నుండుట చేతనే అతడీ విధముగ విమర్శించెనేమో!"

అయినను యువాన్ చ్వాంగ్ వివరములను నిరాధారములని మనము త్రోసి వేయజాలము. అతని వివరములను ఆధారములగ తీసికొని నిర్ణయములు చేయునపుడు, బౌద్ధ మతమును గురించి అతడు వెలిబుచ్చిన అతిశయోక్తులను మనము గమనించరాదు. యువాన్ చ్వాంగ్ క్రీ.శ. 630 లో భారతదేశమునకు వచ్చెను. పండ్రెండు సంవత్సరముల తరువాతనే అతడు

హర్షుని ఆస్థానమునకు చేరెను. అప్పటికే హర్షుడు బౌద్ధమత మును స్వీకరించి యుండవచ్చును. అయినను హర్షుడు అశోకుని యంత బౌద్ధ మతానురక్తుడు కాడనియే చెప్పవలయును. అశోకుడు యుద్ధములతో విరక్తిజెంది, యుద్ధములెంత భీకర మైనవో వాటివలన ప్రజలకెంత హాని కలుగునో కళ్ళారచూచి ప్రశాంత జీవితమును గడుపుటకు నిశ్చయించెను. హర్షుడు అట్లు గాక నలుదిశల దండయాత్రలు గావించెను. అతని జీవితములో నెక్కువభాగము ఈ దండయాత్రలకే సరిపోయెను. క్రీ. శ. 643 లో, అతని మరణమునకు కొద్దికాలము మునుపే, అతడు కొంగోద ప్రదేశము (గంజాము) పై దండెత్తెను. హర్షుని శాంతి విధానమును ఋజువు చేయుటకే అతడు తన పరిపాలనలో మొదటి అయిదు, ఆరు సంవత్సరములే యుద్ధములుచేసి, దేశ మును జయించెననియు, తరువాత ముప్పది సంవత్సరములు శాంతియుతముగ పరిపాలన చేసెననియు యువాన్ ద్వాంగ్ వ్రాసెను. అనగా (క్రీ. శ. 612 నుండి 642 వరకు) యువాన్ ద్వాంగ్ హర్షుని యాస్థానమునకు రాకపూర్వము బౌద్ధమత సిద్ధాంతముల ననుసరించి, శాంతిని నెలకొల్పి, యుద్ధములను విర మించెను. కాని యదార్థముగ జరిగిన దానికంతటికిని ఇది విరుద్ధమే. కాని రెండవ పులకేశితోను, వల్లభి రాజుతోను జరిగిన యుద్ధములు క్రీ. శ. 612 తరువాతనే బహుశ క్రీ. శ. 635 కు దరిదాపుల జరిగెను. ఇంతియెగాక, గౌడరాజు శశాంకుని బల వంతముగ నాక్రమించుకొనిన ముఖారి సింహాసనమునుండి పార ద్రోలినది హర్షుడే యనుటలో సందేహమేమియు లేదు. కాని శశాంకుని పూర్తిగ నాశనము చేయలేదు. ఏలనన క్రీ. శ. 619 వరకు అతడొక శక్తివంతమైన రాజుగా విలసిల్లియుండెననుటకు ఆధారములు గలవు. ఏడవ శతాబ్దిలోని మూడవ దశాబ్దిలో అతడు చిట్టచివరకు హర్షునిచే నోడిపోయి యుండవచ్చును.

ఇందువలన "ముప్పది సంవత్సరములవరకు ఆయుధములను చేబూనక హర్షుడు శాంతి యుతముగ పరిపాలించెననెడి ఉక్తి యువాన్ చ్వాంగ్ పక్షపాతమునకు నిదర్శనమై యుండవచ్చును లేదా చైనా భాషలోనున్న మూలమునకు సరియైన అనువాద మైనను కాకపోవచ్చును. ముప్పది సంవత్సరములవరకు యుద్ధములు చూచిన తరువాత ఆయుధములను విసర్జించి హర్షుడు శాంతియుతముగ పరిపాలించెన"ని బీల్ చేసిన వ్యాఖ్యయే దీని అర్థమని తోచుచున్నది.

హర్షుడు బౌద్ధవంశములో జన్మించలేదనిన విషయము మనము గుర్తుంచుకొనవలయును. అతని పూర్వీకులు సూర్యోపాసకులు. హర్షుని తండ్రియగు ప్రభాకరవర్ధనుడు తూర్పుదిశగ ఎఱ్ఱ గంధపు పూతతో అలంకరింపబడిన వలయాకార ప్రదేశమున మోకరించి సూర్యభగవానుని ప్రతినిత్యము నుపాసించెడి వాడని బాణుడు చెప్పెను.[1] మధూబన్, బాన్స్కేరా శాసనములు కూడ ప్రభాకరవర్ధనుడు సూర్యోపాసకుడే యని తెలుపుచున్నవి. అతడు పరమాదిత్య భక్తుడని ఆ శాసనములలో పేర్కొనబడినది. హర్షుని తాత ముత్తాతలు కూడ సూర్యోపాసకులే. తాత పేరు ఆదిత్యవర్ధనుడు.

హర్షుని వంశస్థులు సూర్యోపాసకులే కాక శివభక్తులు కూడ. బాణుని హర్ష చరితములో దీనికి తగినన్ని ఆధారములు కలవు. సోనేపట్ రాగిశాసన ఫలకముమీద శివుని వాహనము నంది కనబడుచున్నది. ఇటువంటి కొన్ని ఆధారముల వలన హర్షుడు పుట్టుకతోను, బాల్యములోను, హిందూ మతస్థుడేననియు, బౌద్ధ మతస్థుడు కాడనియు నిక్కచ్చిగ తెలియుచున్నది. అతడే

[1] నిసర్గత ఏవన్నృపతి రాదిత్యభక్తో బభూవ ..... ప్రతి దినముదయే ... ప్రాఙ్ముఖః .... స్వహృదయేనేవ సూర్యానురక్తేన రక్తకమల షండేన అర్చాం దదౌ.

వయస్సులో బౌద్ధమతమును స్వీకరించెనో ఇదమిత్థముగ చెప్పుటకు సరియైన ఆధారములు కానరావు. హిందూ మతము నుండి బౌద్ధమతమును స్వీకరించినపుడు లాంఛన ప్రాయముగ సంస్కార మేదియు జరిగియుండక పోవచ్చును. కాని అతని చివరి కార్యకలాపములవలన అతడు బౌద్ధ మతారాధకుడని ఋజువగుచున్నది. దీనినిబట్టి యువాన్ చ్వాంగ్ చెప్పినది కొంత నిజమేయని భావించవచ్చును.

బుద్ధుడు తన మతమును క్రీస్తుకు అయిదు శతాబ్దములకు ముందే స్థాపించెను. బౌద్ధమతము భారతదేశంలో జన్మించినను, అది భారత సరిహద్దులు దాటి చైనా, తూర్పు ఇండియా దీవులు, లంకా మొదలగు ఆగ్నేయాసియా దేశములలో కూడా వ్యాపించెను. అశోకుని కాలములో బౌద్ధమతము దేశము నలుమూలల వ్యాపించెను. అయినను శతాబ్దములుగ హిందూమతము భారతీయ మానసము నుఱ్ఱూతలూగించెననెడి విషయము మన మెన్నటికి మరవరాదు. హర్షుడు బౌద్ధమతమును స్వీకరించి నంతమాత్రమున వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీతల ద్వారా పటిష్ఠమైన హిందూ మతమునకు ఏ విధమైన లోపము గలుగ లేదు. సాధారణముగ మత పరివర్తకులలో ఉత్సాహము, ఆవేశము ఎక్కువగా కానవచ్చును. కాని ఈ మతావేశమునకు హర్షుడు లోనుగాలేదు. బౌద్ధమతమును స్వీకరించినను, రాజోత్సవములలో శివుడు, సూర్యుడు మొదలగు హిందూ దేవతలను ఆరాధించెడివాడు. రాజ్య పర్యటనలలో, 1000 మంది బౌద్ధులతో బాటు 500 మంది బ్రాహ్మణులకు కూడ రాజ్య సత్రములలో ప్రతి దినము అన్నదానము చేసెడివాడు. ఇది హర్షుడు ప్రవేశపెట్టిన సంప్రదాయములలో నొకటి యని బాణుడు ఉల్లేఖించెను.

ఈ బౌద్ధ మతాభిమానము హర్షునిలో బాల్య కాలము నుండియే అంకురించి యుండవచ్చును. తండ్రి చనిపోయిన వెంటనే,

సోదరుని గోల్పోవుటచే తను, తన బావగారి దారుణ హత్య వలనను హర్షునికి జీవితముపై నిరాశ కలిగి యుండవచ్చును. అయినను తన సోదరుని హత్య గావించిన వారిపై పగ తీర్చు కొనుటకును, కోల్పోయిన సోదరిని కాపాడుటకును బద్ధకంకణుడై హర్షుడు దండయాత్రలను ప్రారంభించెను. తన సోదరి రాజ్యశ్రీ కారాగారమునుండి తప్పించుకొని వింధ్యాటడవిలో నెక్కడనో తలదాచుకొనెనని వినినపుడు హర్షుడెంతగా తపించెనో మన మూహించు కొనవచ్చును. యుద్ధ భారమునంతయు సేనాపతి భండి భుజములపై మోపి, భర్తను కోల్పోయిన రాజ్యశ్రీని సంర క్షించుటకు అతడు బయల్వెడలెను. అరణ్యములలో నిటు నటు తిరుగుచుండగా ఆమె దివాకరమిత్రుని ఆశ్రమములో నున్నటులు అతనికి తెలిసినది. దివాకరమిత్రుడు హిందూ మతమును త్యజించి బౌద్ధమతమును స్వీకరించిన ఋషిపుంగవుడు. అపుడే ఆమె చితిలో దుమికి ప్రాణములర్పించుటకు ఉద్యుక్తురాలయ్యెనని హర్షునికి తెలిసిన వెంటనే అతడు ఆశ్రమమునకు వెళ్ళి తన సోదరిని సంరక్షించెను. ఆమెను చూచి హర్షుడు అపరిమితానంద భరితుడయ్యెను. ఈ సంఘటనవలన హర్షుడు కూడ దివాకర మిత్రుని భక్తుడయ్యెను. వెంటనే దివాకరమిత్రుడు హర్షునకు మందాకిని యను నొక హారమును బహూకరించెను. జీవితముపై విరక్తి నొంది, రాజ్యశ్రీ సన్యసించుటకు నిశ్చయించినపుడు హర్షుడు అమెను దివాకరమిత్రుని అనుమతిని పొందవలసినదని కోరెను. ఈ సంఘటనలన్నియు హర్షుని బౌద్ధ మతాకర్షణకు కారణములై యుండవచ్చును. క్రమ క్రమముగ అతని బౌద్ధ మతానురాగము మరింత ప్రగాఢమయ్యెను.

బౌద్ధ మతమును స్థాపించినపుడు బుద్ధుడు తన జీవిత కాలములో కాకపోయినను, తన తరువాత ఆ మత సిద్ధాంతము లను గూర్చి తన శిష్యులే, వేర్వేరు విధములుగ వ్యాఖ్యానించి

విమర్శింతురని తలపోయక పోవచ్చును. ఏ మహనీయుడు లేవదీసిన భావోద్యమమునకైనను ఇట్టి స్థితి సంభవించక తప్పదు. వేదాంత చింతనలో పలు శాఖలు, ఉపశాఖలు బయల్వెడలుట పరిపాటి. కొన్ని శతాబ్దములలో బౌద్ధ మతములో కూడ పదునెనిమిది తెగలు బయల్వెడలినవి. వాటిలో ఈ క్రింది నాలుగు ముఖ్యమైనటువంటివి :—1. సౌత్రాంతికులు 2. వైభాషికులు. 3. యోగాచారులు 4. మాధ్యమికులు. మొదటి రెండు హీనయాన శాఖకు, చివరి రెండు మహాయాన శాఖకు చెందినవారు. హీనయాన సిద్ధాంతము ప్రకారము నిర్వాణ ప్రాప్తికి తపస్సు, సత్య చింతన అత్యవసరములు. మహాయాన సిద్ధాంతానుసారము నిర్వాణ ప్రాప్తికి బుద్ధుని పూజ అనివార్యము. కోరికలను త్యజించుటకు, అజ్ఞానాంధకారమును తొలగించుటకు, జీవన్ముక్తికి, సత్ప్రవర్తన, బుద్ధుని పరిపూర్ణ జ్ఞానము మిక్కిలి అవసరము. బోధిసత్వులలో అనగా బౌద్ధ మతములో సంపూర్తిగ కాకపోయినను, కొంతవరకు పారంగతులైన మహనీయులలో నమ్మికను కలుగచేసిరి. క్రమ క్రమముగా బుద్ధుడు నొక దైవముగా పరిగణింపబడెను. బుద్ధుని విగ్రహారాధనము, పూజలు, ప్రారంభంమయ్యెను. హీనయాన మార్గములో నిర్వాణ ప్రాప్తియే ముఖ్య ధ్యేయము. ఆత్మవికాసము, చిత్తశుద్ధి, సత్ప్రవర్తనయే ముక్తికి ముఖ్య సాధనములుగా నెంచబడినవి. మహాయానము బుద్ధుని యెడల, బోధిసత్వుల యెడల శ్రద్ధాభక్తులను, విశ్వాసమును పెంపొందించెను. హీనయానులు తమ సిద్ధాంతముల ప్రచారము కొరకు పాలీ భాషను ఉపయోగించిరి. మహాయానులు సంస్కృతమును ఆధారముగ గైకొనిరి. వాస్తవముగ, మహాయానులకు హిందూ మతమునకు దగ్గర సంబంధమున్నది. మహాయానులలో కొందరు శూన్యవాదు లుండిరి. వారి దృష్టిలో సర్వమూను శూన్యమే. శంకరాచార్యుల 'జగన్మిథ్యా' సిద్ధాంతమునకు సమీప

ముగనుండి 'అంతయు పరమాత్మమయమే అనియు, ఈ దృశ్య జగత్తు మిథ్య యనియు' వారు కూడా భావింతురు.

హర్షుడు ఏ మార్గము అవలంబించెనో తెలిసికొనుటకు ఈ వివరములు చాల ఉపయోగపడగలవు. యువాన్ చ్వాంగ్ తన యాత్రా సంస్మరణలలో నాటి భారతదేశ స్థితి గతులను చిత్రించె ననుటలో ఏ మాత్రము సందేహము లేదు. ఈ చిత్రణ సరియైనది పరిపూర్ణమైనది కాకపోవచ్చును. భారతదేశ చరిత్ర లోపయుగ మునకు సంబంధించిన సేకరణలలోను ఇంత ఉపయోగకర మైన వివరములు దొరుకలేదు. హీనయాన మార్గము ఎక్కువగా దక్షిణ హిందూ దేశములోను, సింహళములోను వ్యాప్తిచెందెను. మహాయానము మధ్య భారతములోను, ఉత్తర హిందూదేశము లోనేగాక, జావా, సుమిత్రా, బర్మా, థాయ్‌లెండ్, కాంబోడియా మొదలగు విదేశములలో గూడ శీఘ్రముగ వ్యాపించెను. మొదట మొదట సహజముగ హర్షుడు హీనయాన మార్గమునే అవలం బించినట్లు తోచుచున్నది. యువాన్ చ్వాంగ్ భారతదేశమునకు వచ్చినపుడు, దేశములోని విభిన్న ప్రాంతములలో బౌద్ధమత ముతోపాటు, ఇతర మతములు గూడ నే రీతిగా నున్నవో అతడు విపులముగ వర్ణించెను.

యువాన్ చ్వాంగ్ పరిశీలన ననుసరించి ఆ కాలములో, భారత దేశములో, ముఖ్యముగా మూడు మతములుండెడివి. బౌద్ధ మతము, హిందూమతము, జైన మతము వేయి సంవత్సరములకు పూర్వము బుద్ధభగవానుడు స్థాపించిన బౌద్ధ మతము, క్రమ క్రమముగ, కొన్ని శతాబ్దములకు చైనా దేశములో గూడ వ్యాపించెను. ఆ మతము తన జన్మభూమి భారతదేశములో నే రీతిగ నున్నదో విశదముగ తెలిసికొనుటకే ఈ చైనా యాత్రికుడు భారతదేశమునకు వచ్చెను. అందువలన బౌద్ధమత మునకు సంబంధించినంతవరకు యువాన్ చ్వాంగ్ తన వివరము

లలో కొంతపక్షపాతము చూపించుటలో నాశ్చర్యమేమియు లేదు. జైన మతము (దిగంబర శ్వేతాంబర పంథాలలో నేదైనను) హిందూమతము ప్రజలలో బాగుగ నాటుకొని పోయిన ప్రదేశము లలో బౌద్ధమత ప్రాభవము ఎక్కువగా లేదని యువాన్‌చ్వాంగ్ స్వయముగ నంగీకరించెను. హిందూమతమునకు ప్రయాగ (అలహాబాదు) వారణాసి నగరములు పట్టుకొమ్మలు. అనాటి హిందూమతములో విగ్రహారాధన బహుళ ప్రచారములో నుండెను. శివుడు, విష్ణువు (ఆదిత్యుడు లేక ఆదితిగాక) ప్రఖ్యాత దేవతలు. విగ్రహారాధనతోపాటు బ్రాహ్మణులు యజ్ఞములను, యాగములను చేసెడివారు. ఆ కాలములో హిందూ మతములో ఆరు వేదాంత శాఖలుండెడివి. వాటన్నిటికి వేదములే ముఖ్యాధార ములు. వాటిలో మొదటి శాఖకు అధిపతి జైమిని. ప్రతి వ్యక్తియు సాధన, సత్కర్మలద్వారానే మోక్షమును పొందగలడని ఈ శాఖ వారు విశ్వసించెడివారు. జైమిని వేదాంత మంతయు కర్మపై నాధారపడినటువంటిదే. అందులో కొన్ని చేయదగినవి, చేయ రానివి సూచింపబడినవి. ఈ కర్మకాండలలో హోమము చేయుట కూడా గలదు. బాణుడు తన హర్ష చరితములో ఈ విభిన్న వేదాంతశాఖలను అడ్డదిడ్డముగ పేర్కొనెను. కపిలుడు, కణాదుడు, ఉపనిషత్తులు, ఐశ్వరుడు, క్రమికలు (వీరందరు ఈ విశ్వమునంతను భగవంతుడే సృష్టించెననెడి నమ్మకము గల వారు.) వీరేగాక లోకా యతికులు అనగా నాస్తికులు. పైన పేర్కొనిన ఆరుశాఖలు నిజమునకు ఈ క్రిందివి. 1. కర్మవాదులు లేక జైమినేయులు 2. జ్ఞానవాదులు లేక వేదాంతములు. 3. సాంఖ్యులు. 4. యోగులు 5. నైయాయికులు 6. వైశేషికులు. ఈ ప్రాచీన వేదాంత సిద్ధాంతములన్నిటికి వేదములే ముఖ్యాధార ములు. ఏదేని యొక శాఖ ప్రాచీనమైనదా కాదాయని నిర్ణయించు టకు భగవంతుడే సృష్టికర్త అనెడి విశ్వాసము మాత్రమేగాక వేద

ములలో గూడ నా శాఖకు నమ్మకముండవలయును. మిగిలిన ఈ ఆరు శాఖలు వేదములు సర్వోత్కృష్టములైనవని పరిగణించ లేదు. 1. బాణునిచే పేర్కొనబడిన లోకాయతికులు లేక భౌతిక వాదులు, 2. జైనులు మరియు 3 నుండి 6 వరకు — బౌద్ధము లోని నాలుగు శాఖలు. భారతీయ వేదాంత తత్వము ముఖ్యముగా ఈ ఆరు భాగములుగ విభజింపబడినది. బాణుడు తన హర్ష చరితములో పలువిధములైన తెగలను పేర్కొనెనుగాని వారెవ్వరు ఒక తత్వవిచారణ శాఖగా రూపొందలేదు. బాణుడు ఈ క్రింది తెగలవారిని పేర్కొనెను. 1. కేశలుంచకులు 2. శైవులు 3. వాసినులు 4. భాగవతులు 5. పాంచరాత్రకులు మొదలగు వారు. కాని వీరందరు కొన్ని ఉపశాఖలకు చెందినవారే.

యువాన్ చ్వాంగ్ ఈ బౌద్ధేతరులందరిని పరిహసించుచు నిట్లు వర్ణించెను "కొందరు నెమలి ఈకలు ధరించెడివారు. కొందరు పుఱ్ఱెల హారములను మెడలలో నలంకరించుకొనెడి వారును, కొందరు దిగంబరులు, కొందరు తమ శరీరములను ఆకుల లముతో కప్పుకొనెడి వారును, కొందరు జుట్టు పైకిలాగి ముడివేసి కొనెడివారు, కొంతమంది బోడితలల వారు. కాని వీరందరు ఈ విచిత్ర వేషములను ధరించినను తమ సర్వశక్తులను జ్ఞానార్జనకు ఆధ్యాత్మిక వికాసమునకు వినియోగించినారని కొనియాడెను.

యువాన్ చ్వాంగ్ హర్షుని యాస్థానమునకు రాకముందే హర్షునకు బౌద్ధమతమనిన మక్కువగా నుండెడిది. విగ్రహా రాధన, యజ్ఞములు, యాగములు, కర్మకాండలపై నాధారపడిన హిందూ మతమునెడల హర్షున కంతగా నభిమానములేదు. బుద్ధ భగవానుడు బోధించిన సిద్ధాంతములలో నతని కధిక విశ్వాసము గలదు. బౌద్ధమతములోని మహాయాన సిద్ధాంతములో సంపూర్ణ విశ్వాసముతో యువాన్ చ్వాంగ్ భారతదేశమునకు వచ్చెను. ఈ చైనాయాత్రికుని సిద్ధాంతములను విరివిగా ప్రచారము

చేయుటకు హర్షుడు తన రాజధాని కనౌజిలో నొక పెద్ద మత సమావేశము నేర్పరచెను. అప్పటికి మహాయాన సిద్ధాంతము హర్షుని బాగుగా నాకర్షించినది. హిష్-యు-చీ అను యువాన్ ద్వాంగ్ పుస్తకములోను, యువాన్ ద్వాంగ్ జీవిత చరిత్రలోను హర్షుని ద్వారా కనౌజిలో నేర్పరచిన ఈ మత సమావేశము విశదముగ వర్ణింపబడెను. పైన చెప్పినట్లు ఈ మత సమావేశమునకు రెండు ముఖ్యోద్దేశ్యములు గలవు. మొదటిది మహాయాన సిద్ధాంతములను విరివిగ ప్రచారము చేయుట, రెండవది ఈ సిద్ధాంతమును ప్రతిపాదించి పోషించిన చైనా యాత్రికుని, యువాన్ ద్వాంగ్‌ను సత్కరించుట. ఆ సమావేశ మీ విధముగ వర్ణింపబడినది.

"హర్షుడు తన రాజ్యమంతట నొక ప్రత్యేకమగు ఉత్తరవును జారీచేసి విభిన్న వేదాంతశాఖల అనుచరులను కాన్యకుబ్జ నగరములో జరుగు సమావేశమునకు హాజరు కావలసినదని కోరెను. ఈ సమావేశముయొక్క ముఖ్యోద్దేశ్యము చైనా న్యాయశాస్త్రవేత్త ప్రతిపాదించిన సిద్ధాంత వ్యాఖ్యను విమర్శించుటయే. ఈ సమావేశమునకు బౌద్ధమతావలంబులే కాక, పంచ భారతములలోని వివిధ మతస్థులు, మత విద్రోహులు కూడ ఆహ్వానింపబడిరి. హర్షుడు ఈ సమావేశమునకు రాజ ఠీవితో హాజరయ్యెను. యువాన్ ద్వాంగ్‌తో కలిసి హర్షుడు రాజలాంఛనములతో, వైభవోపేతముగ గంగానది దక్షిణతీరము మీదుగ తరలివెళ్ళెను. హర్షుని ముఖ్య సహచరుడు, కామరూప (అస్సామ్) ప్రభువు-భాస్కరవర్మ నదికి అవలి ఒడ్డున నడచుచుండెను. బౌద్ధమత సిద్ధాంతములలో అనన్యమైన శ్రద్ధా భక్తులు కల ఈ రాజులిద్దరు నదికి రెండువైపుల రెండు ఊరేగింపులకు నాయకత్వము వహించి ముందుకు సాగుచుండిరి. వారి వెనుక రంగు రంగుల దుస్తులు ధరించిన సైనికులు, ఏనుగు అంబారీలు, నౌకాదళము వారు వైభవోపేతముగ తరలి వచ్చుచుండిరి. మృదంగ వాద్యము

తూర్యనినాదము, వేణుగానముతో వేలమంది ప్రజలు వారి ననుసరించుచు పోవుచుండిరి. ఈ అనుచరులందరు మూడు నెలలు తరువాత తమ గమ్యస్థానమును చేరుకొనిరి. ఆ సరికే వారిని ఆహ్వానించుటకు ఇరువది రాజ్యముల రాజులు సిద్ధముగ నుండిరి. హీనయాన మహాయాన సిద్ధాంతముల పారంగతులైన మూడు వేలమంది పండితులు, మూడు వేలమంది బ్రాహ్మణులు, నర్గ్రంధులు, వేయిమంది నలందా విశ్వవిద్యాలయమునకు చెందిన విద్వాంసులు సభాస్థలము నలంకరించి యుండిరి. హర్షుని వెనుక, అస్సాము రాజయిన కుమారుని వెనుక 500 గజదళ ముండెను. సభా స్థలములో రెండు పెద్ద పందిళ్ళు నిర్మింపబడినవి. వంద అడుగుల ఎత్తుగల ఒక స్థంభమును నిర్మించిరి. దానిపైన బుద్ధ భగవానుని స్వర్ణ విగ్రహమును నిలబెట్టిరి. ఆ విగ్రహము ఎత్తైనది. దాని నొక ఏనుగుపై నలంకరించి తీసుకొని వచ్చిరి. ఇంద్రభగవానుని వలె దుస్తులు ధరించిన హర్షుడు దానిని అనుసరించెను. అస్సామ్ రాజయిన కుమారుడు శ్వేత వస్త్రధారియై బ్రహ్మను పోలియుండెను. రెండు ఏనుగులను రత్న పుష్పములను మోయుటకై నియోగించిరి. మరియొక ఏనుగుపై చైనా యాత్రికుడు యువాన్ చ్వాంగ్ ఆసీనుడై యుండెను. వివిధ ప్రాంతములకు, దేశములకు చెందిన రాజులును, మంత్రులు, వేద పండితులు మూడువందల ఏనుగులపై ఆసీనులై ఉత్సవములో పాల్గొనుచుండిరి. ఊరేగింపు ఇరువైపుల రెండు బారులుగ తరలివెళ్ళెను. ఈ ఊరేగింపుకు ముందుగా మహారాజు వెడలుచు, దారికి ఇరు ప్రక్కల ముత్యములను, వెండి, బంగారు, పుష్పములను వెద జల్లుచు పూజ్యనీయులైన బుద్ధుడు, ధర్మము, సంఘము యెడల తనకున్న శ్రద్ధాభక్తులను ప్రకటించుచుండెను.

“గమ్యస్థానమును చేరిన పిమ్మట హర్షుడు మొదట వేదిక దగ్గరనున్న విగ్రహమునకు అభిషేకముచేసి స్వయముగ దానిని

పడమటి దిశనున్న ధ్వజస్తంభమునకు గొనిపోయి ముత్యాలతో అమర్చబడిన దుస్తులతో దానిని అలంకరించెను.

హర్షుడొనరించిన ఈ పూజా విధానము, హిందూ మతమునకు, బౌద్ధ మతములోని హీనయానము కన్న సన్నిహితముగా నున్న మహాయాన శాఖకు కొంత విచిత్రముగ నుండవచ్చును. విగ్రహాభిషేకము, అలంకరణము హిందూమత పూజా విధానములోని ముఖ్యాంశములు. హర్షుడు హిందూ మతారాధకుల వంశములో జన్మించినందున చిన్ననాటి నుండియే అతడు ఈ విధానమును ననుసరించుచుండెను. తరువాత బౌద్ధ మతమును స్వీకరించినను అతడు ఈ ప్రాచీన పద్ధతిని త్యజించలేదు. హిష్ – యు – చీ లోను, జీవిత చరిత్రలోను, ఆ మత సమావేశము యొక్క వర్ణన ఈ విధముగ నుండెను.

"అటు పిమ్మట సభా మండపమునకు ఇరువది దేశముల రాజులు విచ్చేసిరి. వేయిమంది మత గురువులు, 500 మంది బ్రాహ్మణులు, నాస్తికులు (బౌద్ధమతమును సంపూర్ణముగ విశ్వసించినందున యువాన్ చ్వాంగ్ జైనులను, బ్రాహ్మణులను నాస్తికులని పేర్కొనెను) విభిన్న రాజ్యములకు చెందిన 200 మంది మంత్రులు ఆ సభకు విచ్చేసిరి. నాస్తికులు బయట నుండిరి. పూజలన్నియు ముగిసిన తరువాత ఒక గొప్ప విందు జరిగెను. దానికి సభలో నున్నవారు, బయట నున్నవారు అందరు హాజరైరి.

తరువాత హర్షుడు సమావేశమును ప్రారంభించెను. యువాన్ చ్వాంగ్‌ను అధ్యక్షాసనమును గ్రహించవలసినదిగా వేడుకొనెను. అతడు యువాన్ చ్వాంగ్‌ని "వాదోపవాదముల మహాప్రభువు" అని సంబోధించెను. అధ్యక్ష పీఠమును అలంకరించిన తరువాత, మహాయాన సిద్ధాంతముల విశిష్టతను కొనియాడుచు యువాన్ చ్వాంగ్ తన ఉపన్యాసమును ప్రారంభించెను. తదుపరి చర్చించవలసిన విషయమును ప్రస్తావించి, నలందా విశ్వవిద్యాలయము

నకు చెందిన మింగ్‌హీన్ అను శ్రమణుని ప్రసంగించ వలసినదని యాదేశించెను. యువాన్ చ్వాంగ్ ఆదేశానుసారము సభా స్థితికి బయటనున్న గోడపై ఈ దిగువ నున్న విజ్ఞాపన చేయబడెను. "తీర్మానములో ఏ ఒక్క మాటైనను తర్కరహితముగ నున్నదని నిరూపించి తీర్మానమును ఖండించగల్గినచో, అట్టివాని కోరికపై తన శిరస్సును గూడ ఇచ్చుటకు సంసిద్ధుడనని, ప్రకటించెను.

ప్రొద్దుగూకువరకు ఆ తీర్మానమును ఖండించుటకు ఎవరు హని సాహసించలేదు. హర్షుడు దీనికి మిక్కిలి ఆనందభరితుడై సమావేశమును ముగించి రాజభవనమునకు వెడలిపోయెను. అటుపిమ్మట సభాసదులందరు తమ తమ విశ్రామ స్థలములకు పోయిరి.

మరునాడు, ఆ విగ్రహమును (కొందరు అది మనిషి ఎత్తున ఉన్నదని, కొందరు మూడు అడుగుల ఎత్తు గలదని భిన్నాభిప్రాయములు వెలిబుచ్చిరి) తిరిగి సభామండపమునకు తీసికొని వచ్చిరి. ఇట్లు అయిదు రోజులు జరిగిన తరువాత హీనయాన సాంప్రదాయికులు యువాన్ చ్వాంగ్‌ను హత్యచేయుటకు కుట్ర చేసిరి. రాజుయొక్క సహాయముచేత యువాన్ చ్వాంగ్ వారిని సంఖ్యాబలముచేతను, బుద్ధిబలము చేతను ఓడించెను. సభ దిగ్విజయముగా జరిగినందువలన వారు చాల చిన్నబోయిరి. తరువాత ఎటులనో గూఢచారుల ద్వారా హర్షునకు ఈ కుట్ర సమాచారమంతయు తెలిసినది. వెంటనే అతడొక ప్రకటన చేసెను. "ఎవరేని ఈ న్యాయశాస్త్రవేత్తకు కీడు చేయదలచినచో అతనికి వెంటనే ఉరిశిక్ష వేయబడును. ఎవరేని అతనిని వ్యతిరేకించినచో అతని నాలుక కోసివేయబడును. అయన బోధనలను వినదలచుకొను వారందరు ఈ ఉత్తర్వులవలన భయపడ నవసరములేదు."

జ్ఞానార్జనకై విదేశమునుండి మనదేశమునకు వచ్చిన అతిథికి, తత్వవేత్తకు ఏ విధమైన అవమానము గాని, హాని గాని జరుగ

కూడదని హర్షుడు భావించుట సమంజసమే. యువాన్ చ్వాంగ్‌ను క్షేమముగా తిరిగి చైనాదేశమునకు పంపించుట రాజుయొక్క నైతికబాధ్యతయై యున్నది. అందువలన ఈ యాత్రికునికి కీడు దలపెట్టిన వారిని నరికివేతునని హర్షుడు చేసిన ప్రకటన న్యాయ సమ్మత మైనటువంటిదే. కాని ఎవరేని అతనికి విరుద్ధముగ మాట్లాడినచో అతని నాలుకను కోసివేతునని హర్షుడు నిజముగ తన ప్రకటనలో వెలిబుచ్చినచో అది అతని ధార్మిక అసమాన మును మాత్రమే సూచించును. కాన్యకుబ్జములో ఈ సమా వేశము ముఖ్యముగా సత్యాన్వేషణకై ఏర్పరచబడినది. 'మహా యానమే సరియైన ధార్మిక మార్గమనెడి యువాన్ చ్వాంగ్ వాద ములో హర్షునకు నమ్మిక యుండవచ్చును. కాని ఇతరుల భిన్నాభి ప్రాయములకు తావీయకున్నచో అవి స్వేచ్ఛా చర్చలు కానేరవు.

సహజముగా హర్షుని ప్రకటనకు తగు ఫలితము చేకూరెను. "తప్పు త్రోవనున్న వారు" తప్పుకొని పోయిరి. అందువలన, పదునెనిమిది దినముల సమావేశానంతరము, అసంతుష్టి చెందిన వాడెవ్వడును కన్పడలేదు.

సభాకార్య కలాపములను గురించి మరియొక అభిప్రాయము కలదు. యువాన్ చ్వాంగ్ జీవిత చరిత్రలో పై విషయము వివ రింపబడినది. కాని, యువాన్ చ్వాంగ్ స్వయముగా వ్రాసిన తన హీ-స్యూ-చీ గ్రంథములో అతని హత్యపై గాక, హర్షుని హత్యకే కుట్రపన్నినట్లు సూచించెను. ఆ వివరణ ఇట్లుండెను.। "ఈ సమావేశము కేవలము యువాన్ చ్వాంగ్ ప్రసంగము కొరకే గాదు, నిగూఢ విషయములపై, చక్కని భాషలో, వాదోపవాద ములు జరుపగల విభిన్న విద్వాంసుల కొరకై ఏర్పరచబడినది. సమావేశపు చివరి రోజున, ఎంతో ధనవ్యయ బాధలతో నిర్మింప బడిన ధ్వజస్తంభమునకును, సభా మండపమునకు పోవు సింహ ద్వారముపైనున్న గోపురమునకును నిప్పు అంటుకొనెను. కాని

మంటలు వెంటనే చల్లార్చబడినవి. దీనికి కారణమేమిటో తెలిసి కొనుటకు హర్షుడు స్వయముగా గోపుర శిఖరము నెక్కెను. మెట్లు దిగుచుండగా నాస్తికుడొకడు అతనిపై కత్తి దూసెను. కాని హర్షుడు దురంతకుని చేతులను గట్టిగా పట్టుకొని అతని ఎదుర్కొనెను. ఈ వార్త వినిన వెంటనే, అక్కడనున్న ప్రభువులందరు ఆ దుండగీడుని వెనువెంటనే సరికి వేయవలసినదిగా కోరిరి. కాని హర్షుడు దానికి సమ్మతింపలేదు. సమావేశములో అవమానము పొందుటవలన నాస్తికులందరు హర్షుని హత్య చేయుటకు కుట్రచేసి, హత్య చేయవలసినదిగా తన్ను పంపిరనియూ ఆ నాస్తికుడు తన నేరము నొప్పుకొనెను. "ఓ మహాప్రభూ! నీవు దేశ దేశాంతర ప్రజలను ఆహ్వానించి శ్రమణులందరికి ఉపహారము లిచ్చుటకును, బుద్ధుని ధాతు విగ్రహమును నిర్మించుటకును కోశాగారములోని ధనమునంతయు వ్యయ పరచితివి. కాని దూర దూరములనుండి వచ్చిన నాస్తికులను నీవు గమనించలేదు. అందువలన వారు కుపితులై, నా వంటి నీచుని కనుగొని, ఈ నీచ కార్యమునకు ప్రేరేపించిరి." అట్లు అతడు తన అపరాధమును అంగీకరించిన వెంటనే సమావేశమునకు హాజరైన అయిదు వందలమంది బ్రాహ్మణులను వెంటనే ఖైదుచేసి వారిని పలు విధములుగ ప్రశ్నించిరి. శ్రమణుల యెడల రాజు ప్రవర్తించిన గౌరవ ప్రపత్తులు వారిలో ఈర్ష్యను రేకెత్తించినవనియు, అందువలన అగ్ని బాణములను విసిరి గోపురమునకు నిప్పంటించితి మనియు, ఆ సమయమున నేర్పడు గందరగోళములో రాజును హత్య చేయుటకు కూడా కుట్ర పన్నితిమనియు వారు తమ నేరమును ఒప్పుకొనిరి. ఆ సందోహములో ఇరుకు దారిని రాజు వెళ్ళునపుడు హఠాత్తుగా రాజును హత్య చేయుటకు వేచియుండ వలసినదిగా ఆ నాస్తికుని తామే పంపితిమని వారు సేకరించిరి. అది విని అచ్చట నున్న వారందరు ఆ బ్రాహ్మణులందరిని నాశనము చేయవలసినదిగా కోరిరి. కాని

హర్షుడు వారిని దేశమునుండి వెడలగొట్టి, ఈ కుట్రలో ప్రముఖ పాత్ర వహించిన వారికి మాత్రము తగు శిక్ష నొసగెను.''

జీవిత చరిత్రలోని వివరము లేక యువాన్ చ్వాంగ్ యాత్రా సంస్మరణములలోని వివరము, ఈ రెండిటిలో ఏది ఎక్కువ సరియైన దైనను, కనౌజ సభ పేరుకు మాత్రమే "సర్వమత తత్వ వేత్తల సభ" యనబడుటలో ఏమాత్రము సందేహము లేదు. హర్షుడు "న్యాయ శాస్త్ర పారంగతుని" పట్లయే గాక, యువాన్ చ్వాంగ్ ఆలోచనా పద్ధతిపట్ల కూడా బహిరంగముగ చాలా పక్షపాతమును చూపెను. ఎవరికైనా భిన్నాభి ప్రాయములున్నచో వాటిని వ్యక్తపరుచుటకు వీలులేక అవమానమును భరించవలసినదే, ఎదిరించుటకు సాహసించినచో శిక్ష ననుభవించవలసిందే. కాని ఈ సమావేశము వలన యువాన్ చ్వాంగ్ జీవితములో ఒక నూతనదశ ప్రారంభమయ్యెను. అతని కీర్తి ప్రతిష్ఠలు అత్యద్భుతముగా పెరిగినవి. హర్షునిపై అతని ప్రభావమే ఎక్కువగానున్నదని తెలిసికొని ప్రజలందరు అతనిని మిక్కిలి గౌరవించిరి. ఇరువది దేశపు రాజులు అతనికి అమూల్యమైన ముత్యములను బహూకరించి తమ శ్రద్ధాభక్తులను వెలిబుచ్చిరి. హర్షుడు స్వయముగా అతనికి 10,000 బంగారు నాణెములు, 30,000 వెండి నాణెములు, 100 మేలైన నూలు వస్త్రములు కానుకగా నిచ్చెను. కాని ఆ యాత్రికుడు ఎంతో వినయ విధేయతలతో ఈ కానుకలను స్వీకరించుటకు తన అసమర్థతను ప్రకటించుచు వాటిని తిరిగి ఇచ్చివేసెను. కాని, వివిధదేశముల మంత్రులవెంట యువాన్ చ్వాంగ్‌ను ఏనుగు అంబారీపై నెక్కించి నగరము నలువైపుల ఊరేగించుటకు కృతనిశ్చయుడై రాజు ఈ విధముగ ప్రకటించెను. "ఈ చైనా దేశపు న్యాయాధిపతి విభిన్న సిద్ధాంతముల నెదుర్కొని, వాటిని కూలద్రోసి, మహాయాన సిద్ధాంతములను స్థాపించెను. పదునెనిమిది రోజులవరకు చర్చలో పాల్గొ

నుటకు ఎవ్వరును సాహసించలేదు.'' ప్రజలందరు ఆనంద భరితులై యువాన్ చ్వాంగ్‌కు ''మహాయాన దేవుడు'' లేక ''మోక్ష దేవుడు'' అను బిరుదు నొసగిరి.

కనౌజ్ మహాసభ హర్షుని మతానురాగమునకు నిదర్శనము. ఇతర మతములకంటె బౌద్ధ మతము యెడలనే అతనికి అభిమానము మెండు అన్న సంగతి అంతకు పూర్వమే విదితమైనది. కాని ఇతర మత సిద్ధాంతముల వ్యాఖ్యలకు, విమర్శలకు తావియ్యక వాటిని అణచివేయుటకు ప్రయత్నించుట మత విషయమున హర్షుని అసహనమునే నిరూపించుచున్నది.

కనౌజ్ మహా సభానంతరము యువాన్ చ్వాంగ్ చైనాదేశమునకు తిరిగి వెళ్ళుటకు నిశ్చయించెను. కాని హర్షుడు ఇదే విధమైన మరియొక మహాసభకు అతనిని ఆహ్వానించెను. ప్రతి అయిదు సంవత్సరముల కొకసారి, గంగా యమునా సంగమ స్థలము – ప్రయాగ (అలహాబాదు)లో హర్షుడు మత సమావేశములు జరుపు చుండెడివాడు. వైదిక యుగము నుండియు ఇది అత్యంత పవిత్ర స్థలముగా పరిగణింపబడినది. ఇచ్చట యథాశక్తిగా చేయు ఏ ఒక దానమైనను మిగత చోట్ల చేయు పదివేల దానములకు సమానముగ నెంచబడి, అనాదిగ ప్రయాగ పుణ్య క్షేత్రమే గాక ''దాన ధర్మ క్షేత్రముగ'' ప్రసిద్ధికెక్కినది. ఇంతకు పూర్వమే, తన ముప్పది సంవత్సరముల పరిపాలనలో, హర్షుడు ప్రయాగలో అయిదు స్నాతకోత్సవ సభలను ఏర్పాటు చేసెను. ''మహా మోక్ష పరిషత్తులు'' అనబడు ఈ సమావేశములు 'మోక్ష' మనెడి రాజ సంబంధమైన దానము లిచ్చుట కొరకే ఏర్పాటు చేయబడినవి. యువాన్‌చ్వాంగ్ తన దేశమునకు తిరిగి వెళ్ళుటకు ఆతురపడుచున్నను, హర్షుని వినమ్ర ప్రోద్బలమునకు లొంగిపోయెను. ''హర్షుడు తన నిధిని ఇతరుల కొసగుటకు వెనుకాడనపుడు, తాను (యువాన్‌చ్వాంగ్) గూడ, తన స్వదేశ ప్రయాణములో కొద్దిపాటి

అలస్యమునకు ఏమాత్రము బాధపడరాదు'' అని నుడివెను. అందు వలన యువాన్ చ్వాంగ్, బీదసాదలకు, తన సర్వనిధిని పంచి పెట్టుటకు, హర్షుడు ఏర్పాటు చేసిన సభలో నుండుటకు అంగీకరించెను.

హర్షుడు యువాన్ చ్వాంగ్‌ని వెంట నిడుకొని ప్రయాగకు వెళ్ళెను. పంచ భారతములోని అన్ని మత సిద్ధాంతముల వారికి-శ్రమణులు, నిర్ఘటులు, నాస్తికులు, నిరుపేదలు, నిరాశ్రితులు, నిస్సహాయులు— మొత్తము 500,000 మందికి ఆహ్వానములు పంపబడినవి. సభా స్థలమునకు ఉత్తరమున గంగానది, దక్షిణమున యమునా నది క్రైవారముగ నుండెను. యువాన్ చ్వాంగ్ జీవితములో ఇదంతయు విపులముగ వర్ణింపబడెను. ''వెదురు బద్దలతో నొక చదరపు కంచెను నిర్మించిరి. ఒక్కొక్క వైపు దాని పొడవు వేయి అడుగులు. దాని మధ్యలో అసంఖ్యాకమైన తాటాకు ఇళ్ళు. వాటిలో బంగారము, వెండి, ముత్యములు, పట్టు, నూలు వస్త్రములు భద్రపరచిరి. ప్రాంగణమునకు బయట ఆహార, అల్పాహార సదుపాయములు కలవు. నూటికి పైగా పెద్ద పెద్ద భవనములు. ఒక్కొక్క భవనములో సుమారు వేయి మందికి విశ్రాంతి స్థలము కలదు. గంగానది ఉత్తర తీరమున హర్షుని శిబిరము, సంగమమునకు పశ్చిమ తీరమున దక్షిణ భారతమునకు ప్రభువైన ధ్రువభట్టుని శిబిరముండెను. (ధ్రువభట్టుడు హర్షునిచే తొలుత నోడింపబడిన వల్లభీరాజు. తదుపరి వారిరువురు మిత్రులైరి. అటు పిమ్మట వివాహ సంబంధము వలన బంధువులైరి). యమునా నదికి దక్షిణముగా అస్సామ్ ప్రభువు-కుమారుని శిబిరముండెను. మధ్యనున్న ప్రదేశములో బహుమతు లందుకొనుటకు వచ్చిన వేలాది ప్రజలుండిరి.

ఈ పంచవర్ష సమావేశము దాదాపు 75 రోజుల వరకు జరుగుచుండెడిది. ఊరేగింపు ముందుగా హర్షుని సిబ్బంది, అనుచరులు,

అస్సామ్ ప్రభువు అనుచరులు ఓడలపై నెక్కిరి. ధ్రువభట్టుని అనుచరులు గజారూఢులైరి. వీరందరు పదునెనిమిది రాజులతో కలిసి వైభవోపేతముగా ముందుకు సాగిపోయిరి.

మొదటి రోజున బుద్ధభగవానుని విగ్రహము ఒక పూరి ఇంటిలో ప్రతిష్ఠచేసి దానిని పూజించిరి. అమూల్యములైన వస్త్రములు, వస్తువులు బీదలకు కానుకలుగా ఇయ్యబడెను. రెండవ రోజున ఆదిత్యుని (సూర్యభగవానుని) ప్రతిష్ఠ జరిగెను. మూడవ దినమున ఈశ్వరుని ప్రతిష్ఠ. ఆ కాలములో అలహాబాదు (ప్రయాగ) హిందూ మతమునకు పట్టుకొమ్మ యని మనము మరువరాదు. బహుశ, అందువలన, హర్షునకు కూడా హిందూ దేవతలను నిర్లక్ష్యించుట అసాధ్యమైన విషయమయ్యెను. అందువలన రెండవ రోజున, మూడవ రోజున జరిగిన హిందూదేవతల ప్రతిష్ఠ కొక సార్థకత కలదు. అయినను ఈ రెండు రోజుల కంటెను మొదటి రోజునే ఎక్కువ కానుకలియ్యబడెను.

నాల్గవరోజున బౌద్ధ సముదాయమునుండి ప్రత్యేకముగా నెన్నుకొనబడిన పదివేలమందికి పరిమితిగా కానుక లొసగబడెను. దీని వలన మిగిలిన వారందరును అధార్మికులుగ అగపడిరి. ఈ బౌద్ధులకు బంగారము, ముత్యములు, నూలువస్త్రములు, పానీయములు, పువ్వులు, పరిమళములు నొసగబడెను. తరువాత ఇరువది రోజుల లోను (5 నుండి 24 వరకు బ్రాహ్మణులకు కానుకలివ్వబడెను. ఎవరికేమి ఇచ్చిరో, ఎంతెంత ఇచ్చిరో వీటి వివరములు స్వయముగా యువాన్ చ్వాంగ్ గాని, అతని జీవిత చరిత్రకారుడు గాని తెలుపలేదు. తరువాత 10 రోజులలో నాస్తికులకు (బహుశ వీరు జైనులు, ఇతర మతస్థులై యుండవచ్చును) బహుమతులియ్యబడెను. తరువాతి దినములలో దూర దూర ప్రదేశములనుండి వచ్చిన బీదలకు, నిరాశ్రితులకు, అనాధులకు దానమునిచ్చెను.

ఈ విధముగ నిధి యంతయు ఖాళీయగు వరకు కానుకలు,

దానములు జరిగినవి. రాజకోశాగారముననున్న ధనమునంతయు ఐదు సంవత్సరముల కొకతూరి ఈ విధముగ ధార్మికులకు, బీదలకు, అనాధులకు, నిస్సహాయులకు హర్షుడు పంచిపెట్టు చుండెడివాడని ఇదివరకే చెప్పియుంటిమి. గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు ప్రభుత్వము నడుపుటకు వలసిన పరికరములు మినహా మిగిలిన వస్తువు లన్నిటిని కానుకలగా నిచ్చెడివాడు. బుద్ధుడు చూపిన మార్గము ననుసరించి హర్షుడు తన ముత్యములు, దుస్తులు, హారములు, కంకణములు, కిరీట రత్నములు గూడా దాన మొసగెను.

ఈ విధముగ తన సర్వస్వమును దానముచేసి హర్షుడు తన సోదరి రాజ్యశ్రీని తాను ధరించుటకొక వస్త్రమిమ్మని వేడుకొనెను. ప్రభుత్వ నిధుల మిగులును ప్రజా సంక్షేమ కార్యక్రమములకు సద్వినియోగము చేయక ఇట్లు దానమొసగుట హర్షుని తీవ్ర మతాపేక్షకు నిదర్శనమనియే చెప్పవలయును. నిజముగ అతనికి స్వీయ సుఖములవాంఛ లేశమైనను లేదు. ఆధునిక కాలములో మనము బీదల సౌకర్యములకొరకు, ఐశ్వర్యాభివృద్ధికొరకు తోడ్పడు యంత్రాంగము నేర్పరచెదము. కాని హర్షుని ప్రభుత్వము నిస్సందేహముగ ప్రజా క్షేమమునకు పాటుపడుటకే ప్రభుత్వ విధులను ఐదు సంవత్సరముల కొకతూరి పూర్తిగ వ్యయపరచెడిది.

బౌద్ధ మతస్థుల యోగక్షేమములకై హర్షుడు చేసిన అమూల్యకృషిని యువాన్ చ్వాంగ్ వివరించెను. సంవత్సరమున కొకసారి బౌద్ధ భిక్షువులందరినీ హర్షుడు సమావేశపరచెడివాడు. ఇరువది యొక్క తూరులు సమావేశ మేర్పరచి వారికి వలసిన వసతులను, వస్తువులను సమకూర్చెడి వాడు. బౌద్ధ దేవాలయములను పునరుద్ధరించి విహార ప్రాంగణము లన్నిటిని చక్కగ నలంకరించెను. బౌద్ధ మతస్థులందరిని సమావేశపరచి చర్చలు జరిపిం

చెను. వారి వారి యోగ్యతాయోగ్యతల ననుసరించి వారికి తగు బహుమతులను, శిక్షల నొసగెడివాడు. వారిలో సంపూర్ణ పాండిత్యమును సంపాదించిన వారిని 'కేసరి సింహాసనము' నెక్కించి వారిని దైవాంశ సంభూతులుగ పరిగణించెను. కేవలము కర్మ కాండలలో ప్రవీణులైన వారిని యథాతథముగ గౌరవించెను. దురాచారులను, దుర్మార్గులను దేశమునుండి బహిష్కరించెను.

బుద్ధభగవానుని పంటిని తిరిగి స్వాధీన పరచుకొనుటకు కాశ్మీరముపై హర్షుడు చేసిన దండయాత్ర పేర్కొనతగినది. యువాన్‌చ్వాంగ్ తన వివరములలో కాశ్మీరరాజు యొక్క అతిథి సత్కారమును కొనియాడెను. యువాన్ చ్వాంగ్‌ను మిక్కిలి గౌరవించి, అతనికి ఐదుగురు నౌకర్ల నిచ్చి, వ్రాతప్రతులను నకలు చేయుటకు ఇరవై మంది గుమాస్తాలను నియమించెను. ఆ రాజు వద్దనే బుద్ధభగవానుని పల్లు కనిపించెను. హర్షుడు ప్రగాఢమైన బౌద్ధారాధకుడు. అందువలన అతడా అవశేషమును స్వాధీన పరచుకొనుటకు యత్నించెను. కాశ్మీర దేశస్థులు ఈ పవిత్రావశేషమును వదులుకొనుటకు ఎంత మాత్రము నంగీకరించలేదు. కాని హర్షుడు నయముననో, భయముననో ఆ అవశేషమును స్వాధీనపరచుకొనెను. కల్హణుని రాజ తరంగణిలో ఈ కాశ్మీర దేశము కొంతకాలము హర్షుని పరిపాలనలో నున్నట్లు సూచించబడెను.

ఇదం స్వభేదవిధురం హర్షాదీనాం ధరాభువాం
కంచిత్కాల మభూద్‌భోజ్యం తతః ప్రభృతి మండలం॥

ఈ పైన పేర్కొనిన విషయములన్నిటి వలన హర్షుని పరిపాలనలో బౌద్ధ మతము ప్రభుత్వ మతముగా నుండెననియు, హర్షుడు నియమ బద్ధముగ దానిని ప్రోత్సాహించెననియు తెలియుచున్నది. కనౌజీ రాజు ఆత్మ నిగ్రహపు నియమము లన్నిటిని సంపూర్ణముగ ననుసరించి ఉత్కృష్టమత వృక్షారోహణ

చేయుటలో నిద్రాహారములను గూడ మానివేసెను. కఠిన శిక్షలు విధించి మాంసాహారమును అతడు నిషేధించెను. అన్ని రహదారులలోను అతడు అనేక సత్రములను నిర్మించెను. ఆ సత్రములలో బీదలకు, నిరాశ్రితులకు అన్నదానములు చేయించెను. ప్రయాణీకుల ఉచిత చికిత్సకై వైద్యులు వలసిన మందులతో సహాయపడెడివారు. అక్బరు, అశోకునివలె హర్షుడు కూడ గాఢ మతాభిమాని, లోక కల్యాణమునకై తన జీవిత సర్వస్వమును సమర్పించిన విశాల హృదయము గల మేటి చక్రవర్తి.

# VI

## సారస్వత పోషకుడు, కవి

మనమింతవరకు హర్షుని గుణ గణములను పరిశీలించి యుంటిమి. అతడు పైతృక రాజ్య భారమును తన చిఱుత వయస్సున అనగా పదునాల్గవ యేటనే వహించవలసి వచ్చెను. అట్లు రాజ్య భారము వహించిన వెంటనే తన జ్యేష్ఠ సోదరుని హంతకునిపై పగ తీర్చుకొనుటకు, తన సోదరి భర్తను నిర్దాక్షిణ్యముగ వధించిన శత్రువుల బారినుండి ఆమెను విడిపించుటకును అతడు వెంటనే సేనాధిపత్యము వహించి యుద్ధములో దిగవలసి వచ్చెను. ఈ రెండు కార్యములను అతడు అచిరకాలములోనే సత్వరముగా నిర్వహించెను. అంతేకాక చిన్న చిన్న రాజులెవరైనను తన్ను ధిక్కరించి శాంతికి అంతరాయము కల్పించినచో వారి నణచివేయు సామర్థ్యము తనకు కలదని నిరూపించి తుదకు విశాల సామ్రాజ్యమును స్థాపించవలెనను ఉద్దేశ్యముతో అతడొక విజయయాత్ర సాగించెను. ప్రజల కావశ్యకములగు జీవితావసరములను సమృద్ధిగా చేకూర్చి ఆదర్శప్రాయమగు పరిపాలన నెలకొల్పుటకు అతడెంతయో పాటుపడెను. హర్షునకు మతమునందు ఆసక్తి మెండు. అనూచానముగా వచ్చుచున్న సనాతన మతమును వదలిపెట్టి బౌద్ధమతమును అనుసరించెను. అంతేకాక, అతడు దయామయుడగుట చేత తాను నిలువచేసిన ధనమంతయు బీద సాదలకు పంచిపెట్టెడి వాడు.

హర్షుడు చరిత్రలో పేరు ప్రతిష్ఠలు పొందిన ప్రభువని చెప్పుటకు పై ఆధారములే చాలును. కాని అతనిని గురించి చెప్పవలసిన విషయములు ఇంకను ఎన్నో గలవు. హర్షుడు దయార్ద్ర

హృదయుడు, పరోపకారి, పరిపాలనా దక్షుడు, గొప్ప వీరుడు సమర్థుడగు సేనాపతి అగుటయేకాక అతడొక సారస్వతజీవి. తాను స్వయముగా పద్య కావ్యములు, నాటకములు రచించుటయే గాక పెక్కుమంది రచయితలను పోషించెను. అతనికి భూముల మీద వచ్చు ఆదాయములో నాల్గవవంతు గొప్ప మేధావులకు బహుమానముగా ఇచ్చుటకు ఉపయోగపడుచుండెడిదని యువాన్ ద్వాంగ్ వ్రాసెను. ఒక విఖ్యాత బౌద్ధ విద్వాంసున కతడు దాదాపు ఎనుబది పెద్ద పెద్ద గ్రామముల నిచ్చెనట. బాణుని వంశీ కవుల కెందరికో కోట్ల కొలది బంగారు నాణెములను బహూకరించెనట. బాణ మయూర కవులు ప్రసక్తిగల ఒక శ్లోకము వలన అతడు కులహీనులను కూడ పోషించుచుండెనని తెలియుచున్నది. తక్కువ కులమునకు చెందిన దివాకరుడు కూడ హర్షుని ఆస్థానమున బాణ మయూరులతో సమాన గౌరవము పొంది అతని ఆస్థాన కవిగా అలరారుట వాగ్దేవి యొక్క ప్రాభవ మునే ప్రకటించునని ఈ శ్లోకము తెలుపుచున్నది.

"అహో ప్రభావో వాగ్దేవ్యా యన్మాతంగదివాకరః
శ్రీ హర్షస్యాభవత్ సభ్యః సమో బాణమయూరయోః"

హర్షుడు గొప్ప రచయిత అను విషయము కొన్ని సాహిత్య రచనలయందు వివరింపబడియున్నది. అతని సాహితీ ప్రతిభను ప్రశంసించుచు అతని కవితాశక్తి వర్ణనాతీతమని, బాణుడు తాను రచించిన హర్ష చరిత్రములో వక్కాణించి యుండెను. (అపి చాస్య కవిత్వస్య వాచః ...... న పర్యాప్తో విషయః) కావ్యరచన యందు హర్షుడు ఇతర గ్రంథములలోని భావములను వల్లెవేయక, నిజ భావామృతమునే ఒలికించుచుండెనని కూడ బాణుడు తన గ్రంథముల యందు వివరించెను. (కావ్య కథాసు అపీతమప్య మృత మృద్వమంతం.) హర్షుడు తన రచనల ద్వారా ప్రపంచ మునకు ఆహ్లాదము కలుగజేసెనని అతి గౌరవనీయముగ

'సుభాషిత రత్న భండారము' లో చెప్పబడినది. (మాఘశ్చోరో మయూరో మురరిపురపరో భారవిః సారవిద్యః, శ్రీహర్షః కాళిదాసః కవిరథ భవభూత్యాహ్వయో భోజరాజః)

జయదేవ కవి తాను రచించిన ప్రసన్న రాఘవ మను నాటిక యందు సుప్రసిద్ధ కవులను పేర్కొని వారి రచనా వైశిష్ట్యమును నిరూపించెను. కవితా కామిని ఆనంద స్వరూపుడగు హర్షునితో పాటు, పలువురు సుప్రసిద్ధ కవులచే అలంకరింపబడి యుండుట చేత ఆమె అందరికిని అభిలషణీయ అగునని జయదేవుడు చమత్కరించెను.

యస్యాశ్చోరశ్చికురనికురో కర్ణపూరో మయూరో
భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః
హర్షో హర్షో హృదయవసతిః పంచ బాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ.

బాణునకు కోట్లకొలది బంగారు నాణెములిచ్చిన రాజకవి, పోషకుడు హర్షుడే యని శోడ్ఢలుడను మరియొక కవి తన 'ఉదయ సుందరీ' కథలో వ్రాసెను.

శ్రీ హర్ష ఇత్యవనివర్తిషు పార్థివేషు
నామ్నైవ కేవలమజాయత వస్తుతస్తు
గీర్హర్ష ఏష నిజసంసది యేన రాజ్ఞా
సంపూజితః కనకకోటిశతేన బాణః

'రత్నావళి' అను నాటికను రచించిన ప్రముఖ కవి శ్రీహర్ష మహారాజు కొలువులో బాణుడు, మయూరుడు అను ఇద్దరు కవు లుండిరని మధుసూదనుని 'భావబోధిని' లో గలదు.

యువాన్ చ్వాంగ్ వలె ఏడవ శతాబ్దపు రెండవ భాగములో హిందూదేశ యాత్రకు వచ్చిన ఈ-త్సింగ్ గూడ హర్షుడు సారస్వత జీవి అను అభిప్రాయమునే ప్రకటించెను. నాగుని బదులు

తన ప్రాణముల నర్పించిన బోధిసత్వుడగు జీమూతవాహనుని కథను శిలాదిత్యుడు (హర్షుడు) పద్య కావ్యముగ వ్రాసెను. అతడు దానిని లయ బద్ధము కూడ జేసి, జనాభిమానము పొందునట్లు నాట్యాభినయములతో మేళవించి ప్రదర్శించు చుండెడివాడట. మమ్మటుడు వ్రాసిన 'కావ్యప్రకాశము' అను ఆలంకారిక గ్రంథములో హర్షుడు రచయితలను, గ్రంథకర్తలను పోషించు చుండెడివాడని వివరింపబడియున్నది. కావ్య రచనా ప్రయోజనములను వివరించుచు ధన సంపాదన అట్టి ప్రయోజనములలో ఒకటి అని మమ్మటుడు వివరించెను.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే సద్యః పరనివృత్తయే కాంతా సమ్మిత తయోపదేశయుజే."

ఈ ప్రయోజనములలో ఒక్కొక్క దానిని వివరించుచు, 'అర్థకృతే' అను దానికి బాణుడు మొదలగువారు హర్షుని వద్దనుండి ధనము పొందిన విషయము ఉదాహరణగా ఇయ్యబడినది. (హర్షాదేర్బాణాదీనామివ ధనం). కావ్య ప్రకాశము యొక్క కొన్ని పాఠములలో బాణునికి బదులుగ ధావకుని పేరు వాడబడినది. హర్షుడు బాణునకు అమితముగ బంగారమునిచ్చి సత్కరించుచుండెను కనుక, ధావకుని పేరు సూచించుట పొరపాటనిపించును. ఇంతకును హర్షుడు కవులను, గ్రంథకర్తలను పోషించెననునదే ముఖ్య విషయము గాని, అతడు బాణుడా, ధావకుడా అను విషయము ప్రధానముగాదు. హర్షుడు వానికి ధన మొసగుట కావ్య ప్రకాశపు గ్రంథకర్తకు తెలిసినదను విషయమే కాక అట్లు ధనమిచ్చెనను విషయమును అతడొక ఉదాహరణ మాత్రముగ తీసికొనెనని గ్రహించవలెను. దురదృష్టవశమున, కావ్యప్రకాశపు వ్యాఖ్యాతలు భిన్నభిన్న భావములతో వాగ్వాదములు లేవదీసిరి. మమ్మటుని వాక్యమునకు సామాన్యమైన అర్థమే మనగా హర్షుని సారస్వత పోషణ ఆనాటి నానుడివలె ప్రసిద్ధి

పొందినదని మాత్రమే. కాని వ్యాఖ్యాతలు బాణుని కావ్యమగు 'రత్నావళి'ని ఎంతో ద్రవ్యమిచ్చి హర్షుడు కొనెనని నిరూపించు టకు చాల ప్రయాసపడిరి. రత్నావళి నాటిక రచించినది బాణుడు గాక హర్షుడే యని నిరూపించుటకు అందలి శైలియే నిదర్శనము. కాదంబరీ, హర్ష చరిత్రములలోని బాణుని శైలి ఆలంకారికముగా దోచును. అతడు పెద్ద పెద్ద వాక్యములు, అంతులేని ఉపమాన ములు పౌరాణిక గాథలు ప్రయోగించుచుండెడి కవి. అందు వలన పఠితలు నాటి నడుగడుగున అధిగమించిన పిమ్మటనే బాణుని అర్థము చేసికొనగల్గుదురు. రత్నావళి నాటిక అట్లు గాక, సులభశైలిలో వ్రాయబడినది. బాణుడు తన కవితను ధనార్జనకు అమ్మజూపిన యెడల, కాదంబరినే అమ్మి కావలసి నంత ధనము చేకూర్చుకొని యుండును. రత్నావళీ నాటిక రచించినది అతడేయని నిరూపించుటకు, అందలి విషయములు అతని జీవితమునకు సంబంధించిన వగుటయే తార్కాణము. కావ్య ప్రకాశమునకు వ్యాఖ్యాత యగు కావ్య ప్రదీపోద్యోతుని పక్షపాతులు గూడ కొందరు గలరు. ధావకుడే రత్నావళిని రచించి, హర్షుని పేరు పెట్టెనని ఇతని అభిప్రాయము. (ధావకః కవిః స హి హర్షనామ్నా రత్నావళీం కృత్వా బహు ధనం లబ్ధ వానితి ప్రసిద్ధిమ్.)

పూర్వకాలమున ధావకుడను నొక కవి రత్నావళి యను తన నాటికను, హర్షుడను ఒకానొక రాజునకమ్మి మిక్కిలి ద్రవ్యము సంపాదించెనని, పరమానందుడు, కొన్ని హస్తలిఖిత సంస్కృత రచనలను ఆధారము జేసికొని చెప్పెను. (ధావకనామా కవిః స్వకృతిం రత్నావళీం నామ నాటికాం విక్రీయ హర్షనామ్నో రాజ్ఞః సకాశాద్ బహు ధనమవాపేతి పురావృత్తమ్.) ప్రారం పర్యముగా మనకు వచ్చు సంస్కృత సారస్వతమున ధావకుడను కవి ప్రసక్తిలేదు. కనుక అతడొక ప్రఖ్యాత కవిగ పరిగణింప

బడెనను విషయము నమ్ముట కష్టము. మరియు, ఈ వాదము హర్షుని మూడు నాటికలలో ఒక దానిని గూర్చియే సాగినది. ఈ వ్యాఖ్యాతలు గూడ (వీరిలో కొందరు హర్షుడు మరణించిన వెయ్యి సంవత్సరముల తరువాతివారు గూడ కలరు.) "రత్నావళి" నే విమర్శించెదరు గాని, ప్రియదర్శిక, నాగానందము అనబడు మిగిలిన రెండు నాటకముల ప్రస్తావన చేయనేలేదు. ఇది కాక హర్షుడు సుప్రభాత స్తోత్రమును కూడ రచించినట్లు చెప్పు కొందురు. దాని రచయిత పేరు ఆ కావ్యములోనే గలదు.

'కవి విమర్శ' యను నొక గ్రంథము సుప్రసిద్ధ కవి రాజశేఖరుడు (కావ్య మీమాంస గ్రంథకర్త) రచించెననియు, పై వ్యాఖ్యాతలు సూచించియుండిరి. కాని నిజముగా 'కవి విమర్శ' యను పేరుగల పుస్తకమేదియును రాజశేఖరునిచే రచింపబడ లేదు. అందువలన దీనిని నమ్ముటకు ఆధారములు లేవు.

"కారణం తు కవిత్వస్య న సంపన్నకులీనతా
ధావకోఽపి హి యద్ భాసః కవీనామగ్రిమో భవత్
ఆదౌ భాసేన రచితా నాటికా ప్రియ దర్శికా
తస్య రత్నావళీ నూనం రత్నమాలేవ శోభతే
నాగానందం సమాలోక్య తస్య శ్రీహర్షవిక్రమః
ఆనందానందభరితః స్వసభ్యమకరోత్కవిమ్."

పై శ్లోకము నాధారము చేసికొని, భానుడే ఈ నాటకములను రచించెనను తీర్మానమునకు వచ్చిన కొందరి అభిప్రాయము త్రోసి పుచ్చదగును. అందువలన హర్షుడే ఈ మూడు నాటకములను రచించెనని దృఢముగా నిర్ణయించవచ్చును.

మన మిప్పుడు ఈ మూడు నాటకములను పరిశీలింతము. మొదటిది, మిక్కిలి జనాభిమానమును పొందిన 'రత్నావళి'. ఇది నాటిక. నాటకము కంటె భిన్నమయినది. ఒక రచన

నాటికయని నిర్ణయించుటకు కొన్ని లక్షణములు దానియందుండ వలెను.

ఇతివృత్తము కల్పనా ప్రసూతము కాని, పౌరాణికము గాని అయియుండవలెను. అంతేగాక కథానాయకుడు ధీరలలితుడై, మంచిపేరు ప్రతిష్ఠలుకల రాజై యుండవలెను. కథానాయిక గూడ రాజ వంశమునకు జెందియుండవలెను. ఇట్టి నాటికలు సాధారణముగ కథానాయిక పేరుతోనే వెలయును. ఇట్లే ఈ నాటికకు రత్నావళి యను పేరు కలదు. ఈ నాటికలు సామాన్యముగా నాలుగు అంకములు మాత్రము గల్గి, సుఖాంతములై యుండును. కాని నాటకములందు ఐదునుండి ఏడు అంకముల వరకు (మృచ్ఛకటికము వలె) ఉండును.

రత్నావళి సింహళ ద్వీపపు రాకుమారి. కౌశాంబి రాజగు ఉదయనునితో ఆమె సంగమము ఈ నాటికలోని కథా వస్తువు.

నాంది ముగియగనే సూత్రధారుడు ప్రస్తావనలో ప్రస్తుతము ప్రదర్శింపనున్న నాటికను - అనగా హర్షునిచే రచింపబడిన రత్నావళిని - పరిచయము చేయును. తర్వాత మొదటి అంకము ఆరంభమగును. సింహళ ద్వీప ప్రభువగు విక్రమ బాహునికి రత్నావళి యను కుమార్తె గలదు. ఆమెకు సార్వభౌముడగు రాజు భర్త కాగలడని ఒక సిద్ధుడు చెప్పును. ఉదయనుని మంత్రియగు యౌగంధరాయణుడు ఈ వదంతి విని, రత్నావళిని తన ప్రభువున కిచ్చి వివాహము చేయదలచును. కాని తన భార్యయగు వాసవదత్త మహారాణికి కోపము గల్గించుట ఉదయనునకు ఇష్టము లేదు. అందుచే రాజు మంత్రి కోరికను మన్నించడు. వాసవదత్త అడవిలో అగ్ని ప్రమాదములో మృతి నొందెనని యౌగంధ రాయణుడు ఒక వదంతి లేవదీయును. తన కుమార్తెను అర్హుడైన ఉదయనునకిచ్చి వివాహము చేయుటకిప్పుడు విక్రమ బాహునకు ఏమి అటంకమును లేదు. అతడు రత్నావళిని ఒక ఓడపై

కౌశాంబికి పంపును. ఆ ఓడ నడి సముద్రములో విచ్ఛిన్నము కాగా, రాకుమార్తె ఒక బల్లను అంటిపట్టుకొని యుండగా ఒక వ్యాపారస్తుడు ఆమెను కాపాడును. ఆమె ఎల్లప్పుడును ధరించెడి కంఠహారము – రత్నమాల – (అందువలననే ఆమెకు రత్నావళి యను పేరు సార్థకమయ్యెను) ను చూచి ఆ వ్యాపారస్థుడామెను గుర్తుపట్టును.

అట్లు రక్షింపబడిన రాకుమార్తెను యౌగంధరాయణుని వద్దకు తీసికొని రాగా, అతడామె నిజరూపము తెలియకుండునట్లు, తగు జాగ్రత్త వహించి ఆమెను మహారాణీగారి కొలువులో సాగరిక (సముద్రమునుండి బయటపడినది) అను పేరిట పరిచారికగా ప్రవేశపెట్టును. ఈ విషయములన్నియు యౌగంధరాయణుడు స్వగతముగా రంగముపై వివరించుట వలన, ప్రేక్షకులకివి విశదమగును. రత్నావళిని తీసుకొని వచ్చిన ఓడలోనే, ఆమెకు తోడుగా వచ్చుచున్న బాభ్రవ్యుడు (ఉదయనుని బంటు), వసుభూతి (విక్రమ బాహుని మంత్రి) గూడ నుందురు. వారు గూడ ఓడ ప్రమాదమునుండి రక్షింపబడుదురు. కాని, రత్నావళి యెట్లు రక్షింపబడెనో వారికి తెలియదు. తమ మనోవైకల్యమును వ్యక్తపరచక, ఆమె మృతి నొందెనన్న విషయము వారు నమ్మి, ఉదయనుని ఆజ్ఞపై కోసల దేశము మీద దాడి జరిపిన రుమణ్వతుని సేనలో గలసిరి. (విక్రమ బాహుని మంత్రి ఈ విషయము ఎవ్వరికిని చెప్పకపోవుట హాస్యాస్పదము!) రాకుమార్తె, ఓడ విరిగిపోయి నందువలన మృతిజెందిన విషయము తెలిసినపుడు, ఆమెజాడ కనుగొనుటకు ఎవరి సహాయమైనను అపేక్షించుట సహజము. కాని అతడా సంఘటన తనలో ఇముడ్చుకొనుట సాధ్యమా ? నాటిక యందలి వస్తు వికాసములో ఇది ఒక లోపముగ దోచుచున్నది. సాగరికను గుర్తు పట్టగల ఇరువురు వ్యక్తులును ఆమెకు దూరమగుదురు. మారు పేరుతోనున్న

సాగరిక తన అందముతో ఉదయనుని వశము చేసికొనునని యౌగంధరాయణుడూహించును. ఉదయనుడు ఆస్థానహాస్య గాని (విదూషకుని) తో ప్రవేశించును. మదనోత్సవము బాగుగ జరుగుచుండును. మదనిక, చూతలతిక యను ఇద్దరు చెలికత్తెలు రంగమున ప్రవేశించి, పాటలు పాడుచు నృత్యము చేయుదురు. విదూషకుడు గూడ సంతోషముతో అందు కలియును. కొంత సేపటికి మహారాజును మకరంద వనమునకు విచ్చేయుమని, మహారాణి తన చెలికత్తెల ద్వారా సందేశము పంపును. రాజును విదూషకుడును ఆ ఆహ్వానము నంగీకరించి అచ్చటకు వెళ్ళుదురు. కాంచనమాల, సాగరిక (రత్నావళి) మొదలగు చెలికత్తెలతో మహారాణి ఉద్యానవనమునకు వచ్చును. రాణి, తన భర్త యొక్క దృష్టి అందమైన సాగరిక మీద పడకుండ ఏదియో సాకు చెప్పి, ఆమె నచ్చటనుండి పంపివేయును. సాగరికను అచ్చటకు ఎందుకు తోడ్కొని వచ్చెనో ఊహింపలేము. మహారాణియే గదా రాజును మకరంద వనమునకు ఆహ్వానించినది. సాగరిక యొక్క క్షణ దర్శనము రాజునకు లభించెనన్న విషయము నిరూపించుటకే ఈ దుర్బలమగు కథా సూత్రమును ప్రవేశపెట్టెనని తోచును. కాని ఈ దేశమునందు మదనోత్సవము ఎట్లు జరుపుకొందురో తెలిసికొను కుతూహలముతో సాగరిక ఒక చెట్టు ప్రక్కన దాగి పరికించుచుండును. మహారాణిముందు మన్మథునకు, తదుపరి, తన భర్తకు ప్రమొక్కును. రాజును ఇదివరకెన్నడును చూడని సాగరికకు ఇప్పుడు, తొలి చూపులోనే రాజుపై వ్యామోహము గల్గును. దీనితో ప్రథమాంకము ముగియును.

మహారాజు ఆ దినము నవమాలికా లతలను ఆ కాలమున పుష్పింప చేయుటకై పరిశోధనలు జరుపుచుండెననియు, సాగరిక కదళీ వృక్షముల పొదరింటికి ప్రసాధన సామగ్రితో వెళ్ళెననియు, మధ్య విరామము (ప్రవేశిక) లో ఇద్దరు చెలికత్తెలు, రంగమున

ప్రకటించెదరు. ప్రణయోన్మాదమునుండి మనస్సు త్రిప్పుకొనుటకై మహారాజు యొక్క చిత్రము చిత్రించి, దానినే పరికించుచుండు సాగరిక ప్రేక్షకులకు పరిచయమగును. మహారాణి యొక్క పెంపుడు పక్షి (సారిక) ని పోషించుటకై నియమింపబడిన సుసంగత ఆమెను (సాగరికను) గమనించును. సాగరిక, తనకు ప్రభువుపై ఏర్పడిన అనురాగమును సుసంగతకు ఎరుక పరుచును. ఉభయుల సంభాషణమును, పంజరములో నున్న పక్షి వినును. ఒక కోతి కట్లు తెంపుకొని స్త్రీలను, పిల్లలను భయపెట్టుచున్నదను వార్త వినబడుటతో వేరొక ఘట్టము ప్రవేశపెట్టబడును. సాగరికా, సుసంగతలు రంగమునుండి త్వరితముగ నిష్క్రమింతురు. కోతి తెరచిన పంజరమునుండి సారిక ఎగిరి పోవును. విదూషకుడు ప్రవేశించి, నవమాలికా లతపై చేసిన పరిశోధన విజయవంతమైనదని ప్రభువునకు వివరించును. సాగరిక యొక్క ప్రేమ గాథ వినిన ఆ పక్షి (సారిక) ఆ గాథను చిలుక పలుకుల వలె పలుకుచుండ, వారందరు గమనింతురు. వారి సంభాషణములో వ్యక్తుల పేర్లు లేక పోవుట వలన, అది ఎవరికి జెందునా యని ప్రభువును, విదూషకుడును ఆశ్చర్యము ప్రకటింతురు. వారు కొంతదూరము పోగా సాగరిక విడిచిపోయిన చిత్రువు కనిపించును. విదూషకుడు రాజును గుర్తించును గాని ప్రక్కనే చిత్రింపబడిన సాగరికను వారిద్దరిలో ఎవ్వరును గుర్తింపజాలరు. ఈలోపలనే సాగరికా సుసంగతులు పక్షిని, చిత్ర పటములను తీసికొని పోవుటకు రాగా, వారు ఉదయన, విదూషకులను గమనించి వారిద్దరి సంభాషణ పొంచుండి వినుటకు ప్రయత్నింతురు. ఇప్పటికే ప్రభువునకు పటములో చిత్రింపబడిన అపరిచిత కన్య యందు అనురాగము ఏర్పడును. అప్పుడు సుసంగత, తన స్నేహితురాలిని ప్రభువునకు పరిచయము చేయును. మహారాణి అచ్చట కరుదెంచినపుడు

కానక్కడ ఉన్నచో ఆమె ఆక్షేపించునను భయముచే సాగరిక అచటనుండి వెడలిపోవును. వాసవదత్త మహారాణి తన భర్త చెంత చిత్రీకరింపబడియున్న చెలికత్తె యొక్క చిత్తరువును గుర్తించి, తప్పించుకొను సమాధానము లిచ్చు భర్తపై కోపగించి, అక్కడనుండి చాల విసురుగ వెడలిపోవును. ప్రభువును, విదూషకుడును విషాద స్థితిలో నిష్క్రమింతురు. దీనితో ద్వితీయాంకము ముగియును.

సాగరికతో ఉదయనుని సమావేశపరచుటకు సుసంగత పన్నిన ఉపాయము, ఇద్దరు చెలికత్తెలు మధ్య విరామము (ప్రవేశకము)నందు వివరింతురు. సాగరిక మహారాణి వేషములోను, సుసంగత మహారాణి చెలికత్తెయగు కాంచనమాల వేషములోను వచ్చుటకు నిశ్చయించబడును. రాజు రంగమున ప్రవేశించగనే ఈ ఉపాయము నతనికి వివరించి చెప్పును. ఈ లోపలనే, మహారాణి ఈ కుట్ర తెలిసికొని అచ్చటకు వచ్చును. ప్రభువును, విదూషకుడును, ఆ వచ్చినది వాసవదత్తయని ఎఱుగక, సాగరికయే యని ఎంచి, ఇష్టా గోష్ఠి జరుపుదురు. రాజు తన తప్పును వెంటనే గ్రహించి, వాసవదత్తను సమాధాన పరచుటకు ప్రయత్నించును. కాని ఆమె ఆగ్రహావేశముతో అచటనుండి వెళ్ళిపోవును. పిమ్మట నిజమైన సాగరిక వాసవదత్త వేషములో వచ్చును. ఈ యుక్తి అంతయు మహారాణి కనిపెట్టినదని అనుమానించి ఆమె ఆత్మహత్య చేసికొనుటకు ఉద్యమించును. రాజు మరల పొరపాటు చేయును. ఆమె వాసవదత్తయే అని ఊహించి ఆమెను కాపాడుటకు సమీపించును, కాని ఆమెను తన ప్రేయసిగా గుర్తించి ఆమెతో అకస్మాత్తుగ సమాగమము లభించెనని రాజు సంతోషించును. ఇంతలో మహారాణి తన కోపావేశమునకు, తన ప్రవర్తనకు పశ్చాత్తాపముచెంది, సమాధాన పడుటకు

సిద్ధమగును. కాని రాజు సాగరికపై కనబరచు ఆసక్తిని వాసవదత్త గ్రహించును. రాజు చాల సిగ్గుపడును.

చివరి అంకములో, సాగరిక ఉజ్జయిని యందుండు తన తండ్రి వద్దకు పంపబడెనని, మహారాణి తెలియజేయును. కాని, ఆమె సాగరికను, రహస్యముగా ఎవ్వరును గమనించకుండునట్లు, రాజ భవనములో బంధించి యుంచును. మధ్య విరామములో సుసంగత విదూషకునికి ఒక ముత్యాల హార మిచ్చును. ఆ ముత్యాల హారము సాగరిక ధరించుచుండెడిది. దాని నొక బ్రాహ్మణునకు ఇమ్మని సాగరిక సుసంగత కిచ్చును. ఎట్లైన సాగరిక ఆత్మహత్య చేసికొనుటకు నిశ్చయించుకొనును. సాగరిక ఉజ్జయినికి ఎట్లు పంపబడెనో విదూషకుడు రాజునకు తెలియపరచి, ముత్యాల హారము చూపించును. అంకమధ్యమున రుమణ్వతుడు కోసల రాజ్యముపై నిర్వహించిన దండయాత్ర సఫలమైనట్లు తెలుపును. అప్పుడు ఒక ఇంద్రజాలికుడు ప్రవేశించి తన విద్య రాజు సమక్షమున ప్రదర్శించును. కాని రుమణ్వతుని సేనలోనున్న బాభ్రవ్య, వసుభూతులు ప్రవేశించగనే, ఇంద్రజాల ప్రదర్శనము ఆపివేయబడును. విదూషకుని వద్దనున్న ముత్యాల హారమును వసుభూతి చూచి, అది రత్నావళిది అయి యుండునని చెప్పును. పిమ్మట వసుభూతి, రత్నావళికిని ఉదయనునకును వివాహము కానున్నదని వివరించుచుండ, రాజ భవనమునకు నిప్పంటుకొనెనను వార్తను ఎవ్వరో తీసికొని వత్తురు. సాగరిక భవనములో బంధింపబడి యుండును. ఆమె అగ్నిలో చనిపోవునన్న భయముతో, ఆమె బంధింపబడిన వృత్తాంతమంతయు వాసవదత్త రాజునకు విశదపరచి ఆమెను రక్షించవలసినదని రాజును వేడుకొనును. వెంటనే రాజు ప్రమాద సలమునకు వెళ్ళి సాగరికను అగ్నిబారి నుండి రక్షించును. అప్పుడు ఆ అగ్ని బూటకమనియు, ఇది అంతయు ఇంద్రజాలికుని చేష్టయే

యనియు తెలియును. వసుభూతి వెంటనే సాగరికను గుర్తు పట్టగా విషయమంతయు విశదపడును. అందరును సంతోషింతురు. సాగరిక యెడల జూపిన ప్రవర్తనకు వాసవదత్త ఎంతయో చింతించును. అప్పుడు యౌగంధరాయణుడు ప్రవేశించి, ఈ వ్యవహారములో తన పాత్రను వివరించును. సాగరిక విడుదలకే తాను ఇంద్రజాలికుని పంపించెనని కూడా అతడు చెప్పును. ఉదయనుడు రత్నావళిని వివాహమాడుటకు వాసవదత్త అంగీకరించుటతో అంతయు సుఖాంతమగును.

ఈ నాటకములో అసంగతములు, అసమంజసములగు ఘట్టములనేకములు గలవు. కాని నాటిక హాస్య జనకముగా నుండవలయును. అందలి ప్రతి విషయమును తార్కికముగా పరిశీలించుటకు వీలు లేదు. రత్నావళీ ప్రియదర్శికలవంటి సుఖాంత హాస్య నాటికలలో కొన్ని సంఘటనలను మనము యథాతథముగా స్వీకరించక తప్పదు.

ప్రియదర్శిక హర్షుని రెండవ నాటిక. ఈ నాటిక యందలి కథా వస్తువు కూడ రత్నావళినే పోలియుండుట వింతగా తోచును. ఈ రెండిటి (రత్నావళి, ప్రియదర్శిక) యందును, నాయికా నాయకుల వివాహము జరిగి తీరును. తొలిచూపులోనే ప్రేమించుట, అసూయచే మహారాణి ఆమెను బంధించుట, ఆమె ఆత్మ హత్య చేసికొనుటకు ప్రయత్నించుట (ఆత్మహత్యా విధానము వేర్వేరుగ నుండవచ్చును) చివరకు రక్షింపబడుట – మొదలగున వన్నియు రెంటికిని సమానములే. దైవ ప్రార్థనముతో నాటిక ఆరంభించును. వసంతోత్సవ సందర్భమున హర్షుడు రచించిన ప్రియదర్శిక యను కొత్త నాటిక ప్రదర్శింపబడునని సూత్రధారుడు ప్రకటించును.

ఒక వృద్ధ మంత్రి ప్రవేశించి, అంగ దేశాధిపతి యగు దృఢవర్మ తన ప్రభువు ప్రియదర్శికను కోల్పోయిన విషయము

పై విచారము వెలిబుచ్చును. ధృఢవర్మ తన కుమార్తెను ఉదయనున కిచ్చి వివాహము చేయుటకంగీకరించ నందున కళింగ రాజు ధృఢవర్మపై దండయాత్ర సల్పును. అతని మంత్రి ప్రియదర్శికను రణరంగమునుండి తీసికొనిపోయి అరణ్యాధిపతి యగు వింధ్యకేతుని ఇంటి యందు ఉంచును. ఆమెను పిమ్మట ఉదయనుని వద్దకు తీసికొని పోవలెనని అతని యుద్దేశ్యము.

మంత్రి లేని సమయమున ఎవరో వింధ్యకేతుని హత్యజేసి, ఆ ఇంటికి నిప్పంటింతురు. ప్రియదర్శిక ఆ మంటలో కాలిపోయెనో, లేక ఎవరైన బలాత్కారముగ ఎత్తుకొని పోయిరో అను విషయము మంత్రికి తెలియదు. ప్రద్యోత రాజ కుమార్తెయగు వాసవదత్తను తీసికొని ఉదయనుడు పలాయన మగుట ధృఢవర్మ బందీకృతుడగుట మొదలగు విషయములతో కూడిన ఈ ప్రస్తావనయే నాటికకు ఆధారము.

ఈ పలాయనము, కారాగార జీవితము మొదలగు సంఘటనలతో ఉదయనుడును హాస్యగాడగు వసంతకుడును, సంతోషముగ కనిపింతురు. కాని రాజు ఖైదీ జీవితమును కొనియాడుట వసంతకున కెంత మాత్రమిష్టము లేక, దానిని విస్మరించ వలసినదని చెప్పును. పిమ్మట రాజు వాసవదత్తకును కారాగారమునకును గల గుణదోషములను సమీక్షించి కారాగారము నందలి అసౌకర్యములనే యెంచి వాసవదత్త యందలి గుణ గణములను గమనించని విదూషకుని తూలనాడును. (దోషాన్ పశ్యసి బంధనస్య న పునః ప్రద్యోతపుత్ర్యా గుణాన్)

అతడు వాసవదత్తపై గాఢానురాగము గల్గియుండును. వింధ్యకేతుతో జరుగుచున్న అసంపూర్ణ యుద్ధమతనికి జ్ఞాపకము వచ్చి దాని అనుకూల పరిణామము గమనించుటకు అతడు తొందరపడును. అప్పుడు విజయ సేనుడు తాను విజయ మెట్లు సాధించెనో వివరించును. ఉదయనుడు శత్రువు యొక్క

వీర మరణము శ్లాఘించి, మిగిలిన వారికి రక్షణ నిచ్చెదనని వాగ్దానము చేయును.

విజయ సేనుడు తానొక బాలికను వింధ్యకేతుని కుమార్తె యను భ్రమతో తీసికొని వచ్చితినని రాజునకు చెప్పును. రాజు ఆ కుమారిని మహారాణి వాసవదత్త యొక్క సొంత సంరక్షణలో నుంచును.

కళింగ రాజుపై మరల యుద్ధము సాగించవలెనను అభీష్ట మును సూచించుచు రాజు తన భవనములోనికి మరలిపోవును.

రెండవ అంకము మరి రెండు సంవత్సరముల పిమ్మట ఆరంభ మగును. ఒక దినమున మహారాణి వాసవదత్త విదూషకుని పిలి పించును. అప్పుడతడు బ్రాహ్మణులకు కానుకలిచ్చు స్వస్తి వాయన కార్య క్రమమునందు పాల్గొనుటకై ఉపవాసము సల్పుచుండును. తానే తొలి బ్రాహ్మణుడనని ఊహించి, విదూషకుడు స్నానము చేయుటకై చెరువునకు వెళ్ళును. రాజు అతని వెంటనే వెళ్ళును. హంసగానము వారి వీనుల విందుగా వినిపించును. తటాకము వద్ద ఆరణ్యక అను నొక కన్య తన సుకుమార మైన వ్రేళ్ళతో వికసించిన పద్మములు కోయుచు మరియొక కన్యతో ముచ్చటించు చుండ, రాజు ఆమె సౌందర్య లావణ్యములను చూచి ముగ్ధుడగును. ఆమె నాగకన్య అయియుండునా? లేక వెన్నెల కన్నె రూపమున వెలసెనా? అని అచ్చెరువొంద సాగును. అతని చెలికాడును, రాజును ఆ యిద్దరు కన్యల సంభాషణమును పొంచుండి విని ఆ సుందరి వింధ్యకేతువు కుమార్తె యని తెలిసికొందురు.

కన్య లిద్దరును వేరు వేరుగా పువ్వులు కోయుటకు బయలు దేరుదురు. రాజు ఆరణ్యక వైపు నుండి తన దృష్టి ఒక్క క్షణ మైనను మరలింపడు. అప్పుడే ఒక తుమ్మెదల గుంపు ఆమెపై బడగా "ఇందీవరికా, ఈ తుమ్మెదలు నన్ను వేధించుచున్నవి. రక్షించు" మని ఆవేదనతో అరచును.

ఈ సమయము కనిపెట్టి, రాజు వెనుక నుండి వచ్చి, తుమ్మెదలను ఉత్తరీయముతో తోలుచు, ఆమెను ఆలింగనము చేసికొని, నెమ్మదిగ ఇట్లనును: "ఓ పిరికిదానా! భయపడకుము, నీ శ్వాస పరిమళముచే ఆకర్షింపబడి, ఈ తుమ్మెదలు నీ ముఖము చుట్టును మూగుచున్నవి. పద్మ కాంతిని విరజిమ్ముచున్న నిన్నవి ఎట్లు విడిచిపోగలవు?"

అయి విసృజ విషాదం భీరు భృంగా స్తవైతే
పరిమళ రస లుబ్ధా వక్త్ర పద్మే పతంతి
వికిరసి యది భూయస్త్రాస లోలాయ తాక్షి
కువలయ వన లక్ష్మీం తత్కృత స్త్వాంత్యజంతి.

రాజు మాటలకు తెప్పరిల్లి ధైర్యము తెచ్చుకొనుటకు బదులుగా, ఆరణ్యక అతని చేష్టలకు భయ కంపితురాలగును. తన్ను రక్షించుమని తన చెలికత్తెయగు ఇందీవరికను ఎలుగెత్తి వేడుకొనును. వెంటనే విదూషకుడు ముందుకు వచ్చి, ఆ అపరిచిత వ్యక్తి వత్సరాజగు ఉదయనుడేనని చెప్పగా, ఆమె వ్రీడాను రాగములతో అతనిని పరికించును. ఆమెను పరిణయ మాడుటకు తన తండ్రి నిశ్చయించిన వరుడా రాజే అగుటయే ఆమె హావభావ ములకు కారణమగును. రెండవ అంకము తర్వాత కొన్ని రోజులు జరుగును. నాయికా నాయకులకు పరస్పర వ్యామోహము మెండగును. మహారాణికి భయపడి వారిద్దరు కలిసికొనలేక పోవుటచే వారి విరహవేదన హెచ్చును.

ఆరణ్యక అరటి తోటలో కూర్చుండి, గాఢాలోచన యందు మునిగి తనలో తాను మాట్లాడుకొనుచుండును. మనోరమ, ఆమె మాటాడుకొను స్వగతమంతయు పొంచుండి వినిన పిమ్మట, ఆమెకు రాజుపై ఎంత గాఢానురాగము గలదో తెలిసికొనును. ఆమెకు మరణమే శరణ్యమని అనిపించును, ఆమె రాజును

ప్రేమించును. ఆ విరహాగ్నికి మరియొక త్రోవలేక ఆమెనే దహించుచున్నట్లు తోచును.

అరణ్యకను ఊరడించుటకై మనోరమ ఆమెను సమీపించును. ఆ సమయముననే అరణ్యక కొఱకు దిక్కులన్నియు వెదకి, వేసారి, తుదకు, కొలనువద్ద కన్పట్టునను ఆశతోవచ్చు వసంతకుడు రంగములోనికి వచ్చును.

రాజును కూడ మన్మథుని బాణములు వేధించుచున్నవని అతడే చెప్పును. ప్రేయసీ ప్రియుల పునస్సమాగమము కొరకు మనోరమా వసంతకులు రహస్యముగా ఏర్పాటు చేయుదురు.

సాంకృత్యాయని అను మహిళ ఉదయన వాసవదత్తుల ఉపాఖ్యాన మొకటి అల్లి ఈ నాటికలో కూర్చును. అరణ్యకకు అందొక పాత్రగలదు. నాట్య ప్రదర్శన సమయము సమీపించును.

రంగశాలలో వాసవదత్త సాంకృత్యాయని మొదలగు ప్రేక్షకులందరును నాటక రూపమును తాల్చిన రాజు వృత్తాంతము యొక్క చివరి భాగమును చూచుటకు వేచి యుందురు.

షేక్స్పియర్ మహాకవి యొక్క 'హామ్లెట్' నాటకములో వలె అంతర్నాటకము ఇచ్చట ఆరంభమగును. అరణ్యక వాసవదత్త వేషములో, చెలికత్తె యగు కాంచనమాలతో కలిసి పాడుచు, మురళి వాయించుచు, రంగమున ప్రవేశించును. ఉదయన పాత్ర ధరించవలసిన మనోరమ, విదూషకునితో చేసికొనిన రహస్యపు టొడంబడిక ప్రకారము, రంగశాల బయటనే వేచి యుండును. నాటికలో తాను యథార్థపాత్రయే ధరించుట యాయని కామార్తుడగు రాజు విదూషకుని ప్రశ్నింపగా, విదూషకుడు "అవును" అని ప్రత్యుత్తర మిచ్చును. రాజు రంగమున ప్రవేశించిన పిదప మనోరమా, వసంతకులు ప్రేక్షకులతోపాటు నాటకము చూచుటకు చిత్రశాలలో ప్రవేశింతురు. రాజు పాత్ర ధరించినది మనోరమా

లేక రాజేనా అను విషయము వాసవదత్తను కలవరపరచును. ఆమె రాజుకు నమస్కరించుటకై లేచును. వాసవదత్త తనను గుర్తించినదను భయముతో రాజు హృదయము ఘనీభవించును. కాని, సాంకృత్యాయని అది యొక నాటక రంగమే యను విషయము వాసవదత్తకు జ్ఞప్తికి తెచ్చును. నాటకమట్లు సాగుచుండగ, అందరును, ఉదయనుని వేషమును బాగుగ ఒప్పించిన మనోరమను కొనియాడుదురు.

'ఇంతలో మనోరమా, వసంతకులు ఒక రమ్యమైన దృశ్యమును తిలకించుచుండ, కొంతసేపటికి వసంతకుడు నిదుర పోవును. వాసవదత్త వేషములో నున్న ఆరణ్యక, తన పరిస్థితిని సూచించును. కరుణ బంధురములగు ప్రణయ గీతములు పాడుచుండ రాజు ఆమె చేరువనే కూర్చుండును. వెంటనే మహారాణి వాసవదత్త ఆగ్రహము చెంది, తాను రాజు యొక్క స్థానమును పంచుకొనలేని కారణమున అట్టి నిరూపణ తప్పని ఈ నాటిక రచించిన సాంకృత్యాయనిని విమర్శించును.

రాజు, ఆరణ్యక చేతిని తన గుండెలకు అదుముకొనగా తన చేయి పట్టుకున్నది మనోరమ అను సంగతి తెలిసియు, ఆమె మేను పులకరించును.

ఉదయనుడు ఆనందముతో పొంగి పోవుచుండును. కాని వాసవదత్త కలవరపడి, ఉద్రేకముతో రంగశాల వదలిపెట్టి బయలుదేరును. రంగ ద్వారము వద్ద నిద్ర పోవుచున్న వసంతకుడు రాణి రాకకు మేల్కాంచును. ఇంకను నిద్రమైకములో నున్న అతడు ఆమెతో ఇట్లనును "మనోరమా! నా ప్రియ మిత్రుడు తన కార్యము ముగించుకొని వచ్చెనా?" మైకముతో పల్కిన ఈ అవివేకపు మాటలు ఆ అంతర్నాటకము నందలి విషయం మంతటిని వెల్లడిచేయును. మహారాణి వాసవదత్త వసంత

కుని, ఆరణ్యకను ఇమవురిని క్షేమ చేయవలసినదని ఆజ్ఞాపించును. మనోరమ ఏవో సాకులు చెప్పి తప్పించుకొనును. ఉదయనుడు నిశ్చేష్టుడై, తన భార్య పాదములపై బడి తప్పు క్షమింపుమని వేడుకొనును.

నాటికలో ఈ అంకము చాల ముఖ్యమైనది. ప్రేయసీ ప్రియులను కలుపుటకు పన్నిన పన్నాగము అంతర్నాటక రచన హర్షుని నాట్య రచనా నైపుణ్యమును స్పష్టపరచు చున్నది.

మూడవ అంకములో వివరించిన విషయములు సంభవించి చాల దినములైనది. ఆ బాలిక ఇంకను నిర్బంధములోనే యున్నది.

ప్రణయమునందు ఆశాభంగము చెంది, జీవితముపై విసుగు పుట్టిన ఆరణ్యక ఆత్మహత్యకు ప్రయత్నింపగా ఆమె ప్రయత్నము లను స్నేహితులెట్లో అరికట్టుదురు.

మనోరమ స్వగతము వలన ఇదంతయు ప్రేక్షకులకు విశద మగును. అంగారవతి మహారాణి తన కుమార్తె వాసవదత్తకు ఒక ఉత్తరము పంపెననియు అందు ఆమెపై కొన్ని నేరములారోపించె ననియు గూడ మనకు మనోరమా కాంచనమాలల మధ్య జరిగిన లఘు సంభాషణ ద్వారా తెలియును. వాసవదత్త మేనమామ యగు దృఢవర్మ కళింగ రాజుచే బందీకృతుడయి ఒక సంవత్సర మయినది. కాని ఉదయనుడు ఆ యపరాధిపై ఇంకను ఏ చర్యయు దీసికొనలేదు.

వాసవదత్త దిగులుపడి నిస్సహాయురాలుగ కన్పట్టును. రాజు నకు తనపై ఆసక్తి లేదనియు ఆయన తన పరిస్థితి యందు ఏమియు శ్రద్ధ వహించుట లేదనియు ఆమె భావించును.

సాంకృత్యాయని నిరాశ చెందిన మహారాణిని చూచి, రాజు అలక్ష్యభావము నిక చూపించబోడని అభయమిచ్చి ఓదార్చుచు ఆమె విచారము పోగొట్టుటకు చాల ప్రయత్నము చేయును.

(రంగము మారును. రాజును విదూషకుడును అరణ్యకను ఎట్లు విడుదల చేయుటయా అని చర్చించుచు రంగమున ప్రవేశింతురు.)
"నీ సేనలతో అంతఃపురమును అణగద్రొక్కి ఆమెను విడిపింపుము" అని విదూషకుడు చెప్పును. కాని మహారాణిని సంతోషపరచుట తప్ప దీనికి మరొక మార్గము లేదని రాజునకు తెలియును. ఆమెను సమాధాన పరచుటకు మార్గము తెలుపుమని రాజు వసంతకుని అడుగగా, అతడొక నెల రోజులు ఉపవాస ముండవలెనని సలహా ఇచ్చును. విదూషకుడు ఖైదునుండి విడుదల చేయబడెనా, లేక తప్పించుకొని పోయెనా యను విషయముపై ఏమియు సూచనలేదు. రాజు విదూషకునితో కలిసి వాసవదత్తను చూచుటకు పోవును. రాజును చూడగనే మహారాణి గౌరవ భావముతో తన అసనమునుండి లేచి, గతమునకు సిగ్గుపడు చుంటిరాయని రాజును ప్రశ్నించును.

"చేసిన తప్పునకు నేను నిజముగ సిగ్గు పడుచుంటిని" అని రాజు పలుకుచు చేతులు జోడించి క్షమాపణ వేడుకొనుచు, నేలపై కూర్చుండును. అతనికి రాణి యొక్క అనురాగమును పోగొట్టు కొనుట ఇష్టము లేదు. అప్పుడే సాంకృత్యాయని దృఢవర్మకు తటస్థించిన దురవస్థయే ఆమె నైరాశ్యమునకు కారణమని వివరించును. విజయసేనుని ఆధ్వర్యమున కళింగ రాజుపై ఒక దండయాత్ర సల్పబడెననియు తన సేనానాయకుడు తెచ్చు విజయ వార్త కొఱకై తాను రక్షించుచుంటిననియు, రాజు చెప్పును.

అప్పుడే విజయసేనుడును దృఢవర్మ యొక్క మంత్రియు రంగమునకు వచ్చి తాను యుద్ధమున విజయమొందితి మనియు తిరిగి దృఢవర్మకు సింహాసనము లభించినదనియు చెప్పుదురు. అప్పుడు మహారాణి వాసవదత్త సంతోషమునకు మేర ఉండదు. ఆ సంతోష సమయమును పురస్కరించుకొని ఇప్పటివరకు శాంతముగ నున్న వసంతకుడు, ఈ శుభ సమయమున గురువు

లను పూజించి, బ్రాహ్మణులను గౌరవించి, ఖైదీ లందరిని విడుదల జేయవలెనని సూచన చేయును. మహారాణి వెంటనే అందలి భావము గ్రహించును.

అంగీకారము లభించిన వెంటనే సాంకృత్యాయని ఆరణ్యకను విడుదల చేయుటకై బయలుదేరును. మంత్రి, తన రాజు పంపిన సందేశమును అందజేసి ఉదయనునకు నిశ్చితార్థము చేయబడి తుదకు మాయమయిపోయిన ప్రియదర్శిక యొక్క దురవస్థను వివరించును.

తోబుట్టువు కనిపించలేదను వార్తతో వాసవదత్త మిగుల చింతించును. ఆ రాకుమార్తె ఆరణ్యక తప్ప మరెవ్వరును గాదని మహారాజును విజయసేనయు నిశ్చయించుకొందురు. అప్పుడే మనోరమ అతి వేగముగా రంగ స్థలమునకు వచ్చి ఆరణ్యక ఆపదలో నున్నదని సూచించును. సోమపానమని మరిపించి తేబడిన విషమును ఆమె త్రాగెను. వాసవదత్త ఈ పరస్థితికి భయపడి, తన భర్తవద్ద విషమును హరించుటకు గల ఔషధముండుట వలన, ఆమెను తమ యింటికి దీసికొని రమ్మని చెప్పును.

అతి విషమ పరిస్థితిలో నున్న ఆరణ్యకను రాజు తాను నాగ జాతి వారి దగ్గర నేర్చిన చికిత్సతో రక్షించును. అప్పుడు మంత్రి ఆమె నిజ రూపమును వ్యక్తపరచును.

ఔదార్యముతో మహారాణి తనకు తిరిగి లభించిన సోదరిని మహారాజునకు మందహాసముతో అర్పించును. దీనితో ఉదయన ప్రియదర్శికల ఉపాఖ్యానము ముగియును. తెర వ్రాలును.

ఇట్లు 'రత్నావళి' యందుండు సంఘటనలే 'ప్రియదర్శిక' యందు గూడ కూర్చబడినవి. రెండింటిలోను కథా నాయకుడగు ఉదయనుడు తుట్టతుదకు తన ప్రేయసిని కలిసికొనుట, అంతయు సుఖాంతముగ ముగియుట జరుగును.

ఈ మూడు రూపకములలోను, నాలుగంకములు గల్గిన

నాగానందము విలక్షణమైన నాటకముగా పరిగణింపబడు చున్నది. ఇది శాస్త్ర సమ్మతమగు నాటకము. అందలి కథానాయకుడగు జీమూతవాహనుడు నాగుని సర్పమును రక్షించుటకు, తానే బలియై తన స్వార్థ త్యాగమును ప్రదర్శించును.

బౌద్ధమత సిద్ధాంతములందు ముఖ్యమైన ఆత్మోత్సర్గము యొక్క మహిమను కొనియాడుటే దీని ఉద్దేశ్యము.

అందలి పాత్ర లందరును పౌరాణిక వ్యక్తులు గాని, మనుష్య మాత్రులు కారు. హర్షుని మిగిలిన రెండు నాటికల వలె ఇది లలిత శైలిలో వ్రాసిన సుఖాంత నాటిక కాదు. మొదటి మూడు అంకములకును, చివరి రెండింటికిని ఏ విధమగు పూర్వాపర సంబంధము లేనందున కథ అగమ్యగోచరముగా నుండును. చివరి రెండు అంకములు మొదటి మూడు అంకములకు సహజ పరిణతిగా తోచవు. అందుచే హర్షుని నాటక రచనా చాతుర్యము రాణింపలేదని చెప్పవచ్చును.

ప్రార్థనా నంతరము, ఇంద్రోత్సవ సందర్భమున హర్షుని సామంత రాజులు విద్యాధర జాతకుని కథకు సంబంధించు నాటిక నొకటి ప్రదర్శింపుమని కోరినట్లు సూత్రధారుడు రంగము పైసూచించును.

విద్యాధర రాజకుమారుడు విదూషకుని వెంటబెట్టుకొని తపస్సు చేయుటకు అనుకూలమైన తోట వెదకుకొనుచు మలయ పర్వత ములలోని అరణ్యములలో దిరుగుచుండును. రాజు యొక్క విలాసముకంటె తల్లి దండ్రుల సేవ తనకు ముఖ్యము.

అట్లు కొండలమీద తిరుగుచు, అతడొక పర్ణశాలకు వచ్చును.

తదుపరి, కథానాయిక యగు మలయవతికి ఒక స్వప్నము వచ్చును. అందు గౌరీదేవి ప్రత్యక్షమై, ఆమె భక్తికి మెచ్చి, ఆమెకు విద్యాధర మహారాజు భర్త కావలెనని దీవించును.

హర్షుడు వేరొక నాటకమునందు జోస్యము ఉపయోగించును. ఇందు 'స్వప్నము' ను ఉపయోగించెను.

విదూషకుడు సిగ్గుపడుచున్న రాకుమారుని రాకుమార్తె సమక్ష మునకు తీసికొని రాగా, తొలి చూపులలోనే వారికి పరస్పరాను రాగ మేర్పడును. కాని పర్ణశాలనుండి ఒక దూత వచ్చి, ఆమె మాధ్యాహ్నికమునకు పర్ణశాలకు రావలెనని మునీశ్వరుడు పంపిన సందేశము అందగనే, వారి తొలి సమావేశమున కంతరాయము కల్గును. ప్రథమాంకము ఇంతటితో ముగియును.

రాకుమార్తె మలయవతి యొక్క ఇద్దరి చెలికత్తెల మధ్య జరుగు సంభాషణమును బట్టి ఆమె చందన లతానికుంజము నందు విశ్రమించ వలెననుకొను చున్నదని మనకు తెలియును. పువ్వులు కోయుట వలనను, ఎండ వేడి వలనను కలిగిన అలసటను ఆమె పోగొట్టుకొన దలచును.

ఈ అంకము నందలి ఘటనలు ఉదయమున ఆరంభించును. ఆ తరువాత క్రమముగా నాయికా నాయకుల మధ్య పెంపొందు చుండిన ప్రణయము, వారి విరహ తాపము ఈ అంకమున చిత్రించబడును. అంతేకాక జీమూతవాహనుని పదాన్యత ఇతరుల శ్రేయస్సు కొరకు ఎట్లు పాటు పడవలెనను పరహిత భావన ఇందు చిత్రింపబడినవి.

కథానాయిక చికిత్సకు లొంగని ప్రణయావేదనతో బాధ పడుచు, చందనపు పొదరింటి యందొక రాతిపై పరుండును. ఈ బాధనుపశమింప జేయుటకు, ఆమె అంతర్యము నెరిగిన ఒక చెలికత్తె ఆమె వక్షమునకు గంధము పూయును. ఈ బాధకు ప్రియుని దర్శన మొక్కటే ఉపశమనమని నాయిక చెప్పిన సమాధాన మెంతో సమంజసమైనది. వారిద్దరును అడుగుల చప్పుడు వినబడగనే ఎట్టిని అశోక వృక్షము వెనుక దాగు కొందురు.

ప్రణయార్తుడగు నాయకుడు విదూషకునితో ప్రవేశించి, తాను స్వప్నములో విలపించుచున్న తన ప్రేయసిని చూచిన శిలా ఖండము మీదనే కూర్చుండును. అతడు తన స్వప్నమును వివరించుచుండ, కథానాయిక చెట్టు వెనుక పొంచుండి వినును. కాని ఆ వివరణ మంతయు ఆమె అపార్థము చేసికొని, నిరాశ చెందును. ఇట్లు రాజు తన ప్రణయమూర్తిని శిలాఖండము పై చిత్రించును.

రాకుమార్తె సోదరుడగు మిత్రావసుడు కూడ అచ్చటకు చేరును. రాజు తాను వ్రాసిన చిత్రమును ఒక అరటి ఆకు క్రింద దాచును. సిద్ధరాజ కుమారుడైన మిత్రావసుడు తన సోదరిని రాజునకిచ్చి వివాహము చేయవలెనను అభిప్రాయము వెలిబుచ్చును. కాని తన ప్రేయసి యగు మలయవతి, మిత్రావసుని సోదరియే అను విషయము నాయకునకు తెలియక అతడు మిత్రావసుని ప్రతిపాదన నిరాకరించును. ఆ ప్రతిపాదనకు జీమూతవాహనుని తండ్రి యొక్క అంగీకారము పొందవలసిన దని విదూషకుడు మిత్రావసునితో చెప్పును.

ఆ సంభాషణ వినిన నాయిక, రాజు మరియొక స్త్రీని ప్రేమించెనని తలచి, నిరాశ చెంది ఒక తీగె త్రాటితో ఉరిబోసి కొని ఆత్మహత్య చేసికొనుటకు ప్రయత్నించును.

ప్రక్కనే దాగియున్న ఆమె చెలికత్తె, కెవ్వున కేకవేయగా, నాయకుడు అచ్చటకు పరుగున వచ్చి, మలయవతి ఆత్మహత్య చేసికొనకుండునట్లు చూచును.

ఆమెను అదే శిలాఖండము వద్దకు తీసికొనివచ్చి, అతడు చిత్రించిన చిత్తరువు చూపగనే, అతని ప్రేమను గూర్చి ఆమెకు నమ్మకము గల్గును.

అప్పుడే ఒక చెలికత్తె వచ్చి మలయవతి వివాహము వెంటనే జరుగబోవునని చెప్పును.

వివాహమహోత్సవమునకు వచ్చిన సిద్ధులును, విద్యాధరులను

మలయ పర్వతము మీది కుసుమాకర వనములో విందు లార గించుచుందురు. మద్యము సేవించిన శేఖరకుడను విటుడు, మద్య భాండము మోయు నొక సేవకుని వెంటబెట్టుకొని వన మున ప్రవేశించి, తన ప్రేయసియగు నవమాలికకై ఎదురుచూచు చుండును. తన స్నేహితుడైన జీమూతవాహనుని జూచుటకు విదూషకుడు గూడ తేనెటీగలు కుట్టకుండునట్లు ఎఱ్ఱని దుస్తులతో శరీరమును కప్పుకొని, వనమునకు వచ్చును.

ఆ మైకములో శేఖరకుడు, విదూషకుని తన ప్రేయసిగా నెంచి, కౌగిలించుకొనును.

అతని ప్రియురాలగు వనమాలిక ఈ దృశ్యమంతయు కని పెట్టి ఈర్ష్యా క్రోధములకు గురియగును. "ఓరి తొత్తు కొడుకా! ఇక్కడ నీ నవమాలిక ఎక్కడరా?" అని విదూషకుడు కేక పెట్టును.

తరువాత దృశ్యము మారును. నాయికా నాయకులు ఆనందముగ వివాహితులై సరస సల్లాపములు చేయుచుందురు. ఆమె ముఖము ఎండ వేడికి కందిపోయినను, చంద్రకాంతిని అతిశ యించు కమనీయ కపోలములతో అతనికి పరమానందమును గల్గించును. అతని ప్రణయము అంతకుమించి అతని సాన్నిధ్యము ఆమెను ఆనందపరచును.

అతని రాజ్యము నంతటిని మాతంగుడు దోపిడి చేసెనను సమాచారము మిత్రావసుడు తీసికొని వచ్చిన వెంటనే, వారిరువురి ఆనందమున కంతరాయము కలుగును. అతడు శత్రువులను చంపుటకు అనుజ్ఞ కోరును. కాని తన రాజ్యము, తన ప్రాణము అపాయస్థితిలో నున్నప్పటికిని, అతడు జీవహింసకు ఒప్పుకొనడు.

ఈ వార్త వలన అతడేమాత్రము కలతజెందక మరొక ప్రాణి సౌఖ్యము కొరకు తన ప్రాణములైనను ఇచ్చుటకు సిద్ధ పడును. తన అభిప్రాయమును సమర్థించుచు అతడు పరార్థ జీవియగు

సూర్యుని స్తుతించును. దీనితో మూడవ అంకము ముగియును.

మిత్రావసుని మంత్రియు ద్వారపాలకుడును సంభాషించుకొను చుందురు. వధూవరులు దీపావళి పండుగ దినములలో ధరించు టకు ఎఱ్ఱని దుస్తులను తీసికొనిపొమ్మని మిత్రావసుని తల్లి అయిన మహారాణి అతనిని ఆజ్ఞాపించును. విశ్వావసుడు తన కుమారుడగు మిత్రావసుని అల్లునికి ఇదే సమయమున కానుక లిచ్చుట మంచిదని యెంచి అతనిని పిలుచుకొని రమ్మని పంపును.

జీమూతవాహనుడు తన బావమరదియగు మిత్రావసునితో సముద్రపుటొడ్డున విహరించుచుండును. అస్థిరాసులతో నిండిన కొండశిఖరములు, హిమాలయ పర్వత శిఖరముల వలె తెల్లగా, జీమూతవాహనునకు కనిపించును. అవి పక్షిరాజగు గరుత్మంతు నిచే కబళించబడిన సర్పముల అస్థి పంజరముల ప్రోగులని అతడు తన బావమరిది వలన తెలిసికొనును. గరుత్మంతుడు, సర్పరాజగు వాసుకితో చేసికొనిన ఒడంబడిక ప్రకారము, వాసుకి దినమున కొక్క సర్పమును మాత్రము గరుత్మంతునికి భక్షణార్థమై అర్పించుచుండును.

నాగ వంశము గరుత్మంతునిచే సర్ప నాశనము కాకుండ రక్షించుటకే ఈ ఒడంబడిక కావింపబడినది. అహింసకు, కరుణకు చిహ్నమైన జీమూతవాహనుడు ఆ దృశ్యమును చూచి నిర్వేద చెందును. ఇంతలో ఒంటరిగానున్న జీమూతవాహనునకు ఒక స్త్రీ విలాపము వినిపించును. ఆమె కుమారుడగు శంఖచూడుడు ఆ రోజు గరుత్మంతునికై బలిగా పోవలసియుండుటయే ఆమె రోదనమునకు కారణము. ఆమెపై జాలి నొందిన జీమూత వాహనుడు "ఈ విపన్నుల రక్షింపలేని నా తనువు వలన ప్రయోజనమేమి?" అని వాపోవుచు, నాగకుమారునికి బదులుగా తానే బలియగుటకు సిద్ధపడును. (బలి చిహ్నముగ సర్పమునకు

దొడుగు ఎట్టి దుస్తులను తనకిమ్మని శంఖచూడుని కోరును, కాని అతడు దానిని సమ్మతించడు. జీమూతవాహనుని పంపి, తాను తప్పుకున్నచో, తన కుటుంబ గౌరవమునకే అప్రతిష్ఠ గల్గునని అతడు భావించును.

మహోన్నత భావావేశమున తన ప్రాణము కంటె, దుర దృష్టుల క్షేమమే ముఖ్యముగా నెంచిన జీమూతవాహనుడు, తాను బలియగుటకు ధృఢ నిశ్చయుడగును.

ఆకలితో గరుడుడు ప్రవేశించు వేళ సమీపించును. దక్షిణ గోకర్ణునికి తుది వందనముచేసి వచ్చుటకు శంఖ చూడుడు వెడలును.

అదే సమయమున మంత్రి వచ్చి, ఎఱ్ఱని దుస్తులు బహూకరించి, వెడలి పోవును. ఆ ఎఱ్ఱని దుస్తులు మలయవతి తల్లి దండ్రులు బహూకరించినవి. ఎఱ్ఱని దుస్తులతో జీమూతవాహనుడు బలి పీఠమును జేరును. గరుడుడు వచ్చి, వానిని కొండ శిఖరము నకు ఎత్తుకొనిపోవును. అతని ధైర్య సాహసములకు మెచ్చి దేవలోకము నుండి పూల వర్షము కురిసి జయ భేరీలు మ్రోగును. తుదకతడు తన కర్తవ్యమును సాధించును. దీనితో నాల్గవ అంకము ముగియును.

ద్వారపాలకుడు జీమూతవాహనుని గృహమునకు వచ్చి, అతడు సముద్రపుటొడ్డు నుండి ఇంకను తిరిగి రాక పోవుటచే, మామగారు వ్యాకులత నొందుచుండిరని చెప్పుచు, అతని జాడ లేమైన తెలియునేమో యని విచారించును.

అతని ముసలి తల్లి దండ్రులును భార్యయు ఏదో ఒక దుశ్శకునమును గాంచి అతనికేదో కీడు సంభవించి యుండునని భావింతురు. శంఖచూడుడు తన ధ్యానము పూర్తిచేసి, త్వరిత ముగ యథాస్థానమునకు చేరును.

తాను తిరిగి వచ్చులోపలనే జీమూతవాహనుడు తన స్థానమున

జేరి నిజ దేహమును అర్పించెనని తెలిసికొని, "అయ్యో, అయ్యో! విధి నన్ను మోసము చేసినదిగదా!" అని విలపించును.

దయామయుడును, మహనీయుడును అగు జీమూతవాహనుని గూర్చి, అతడు మిక్కిలి పరితపించును. అశ్రుపూరిత నేత్రములతోను, నీరసించిన మనసుతోను అతడు జీమూతవాహనుని రక్తపుజాడలను వెదకుకొనుచు వాని కుటుంబము నివసించుచున్న స్థలమును జేరుకొనును. జీమూతవాహనుడు గరుడినిచే వధింపబడెనని వారు తెలిసికొని అందరు సొమ్మసిల్లుదురు. తెప్పరిల్లిన పిదప, వారందరు జీమూతవాహనుడు మృతినొందెనని తాను కూడ ఆత్మహత్య చేసికొనుటకు సిద్ధమై, ఆ రక్తపు త్రోవనే అనుసరింతురు.

కొండ శిఖరముపై గరుడుని యెదుట అత్యంత ప్రమాద స్థితిలో పడియున్న కథానాయకుడు కనిపించును. ఆ పక్షి రాజు రక్తమును పీల్చివేసి అతని శరీరమును తన వాడియైన గోళ్ళతో చీల్చుచుండును. కాని కథా నాయకుడు శారీరక బాధ ఏమియు లేనట్లే ప్రశాంతముగా నుండును.

అతడెవడో తెలిసికొనవలెనని గరుడునకు ఆసక్తి గల్గును. రక్తనాళములు తెగి నెత్తురు కారుచున్నను, శరీరములో మాంసమింకను మిగిలియుండును. శంఖచూడుడు ఆ ఎఱ్ఱని దుస్తులతో మరి ముగ్గురిని వెంటతీసికొని పోయి వడి వడిగా అచ్చటకు వచ్చును.

ఇద్దరును ఒకేరకమైన వస్త్రములు ధరించుటవలన తనకు ఆహారము కావలసినది నిజముగా ఎవరో బోధ పడదు. వాసుకి గరుడునికి ఆహారముగా పంపినది తననే యని శంఖ చూడుడు చెప్పును. గరుడుడు తాను చేసిన గొప్ప తప్పును గమనించును. అతని హృదయము పశ్చాత్తాపముతో నిండును.

కథా నాయకుని తల్లి దండ్రులు, భార్య అతని దుస్థితికి మిక్కిలి

విచారింతురు. కాని జీమూతవాహనుని బలి, నాగజాతి నంతటిని రక్షించక, ఒక్క నాగునే రక్షించెనని జీమూతవాహనుని తండ్రి తన కుమారుని బలిదానమునకు మెచ్చుకొనుటకు బదులుగ తూల నాడును. ఆ సమయమున గరుడుడు తన పాప పరిహారార్థము అగ్నిలో దుముకుటకు నిశ్చయించుకొనును. నిజమైన పశ్చాత్తాపము ఆత్మహత్య వలన గాక జీవరాశిని రక్షించి వారికి సాయము చేయుటవలననే సాధ్యము కాగలదనియు, అందువలన గరుడు డట్లు చేయవలదనియు కథానాయకుడు బ్రతిమాలును. జీమూత వాహనుడు జవసత్త్వములు కోల్పోయి మరణోన్ముఖుడై తల్లి దండ్రులకు తుది వందన చేయుటకై తన చేతులు జోడించుటకు సాయము చేయుమని నాగుని కోరుచు ప్రాణములు విడుచును.

అతనితోపాటు మరణించుటకు అందరును (శంఖచూడునితో సహా) సిద్ధపడుదురు. గరుడుడు మనసు మార్చుకొని ఆకాశమున కెగరును. కథా నాయకునే గాక, భక్షింపబడిన సర్పముల నన్నిటిని తిరిగి బ్రతికించుటకు ఇంద్రుని అమృతవర్షము కురిపింపు మని వేడుటయే, అతడు ఆకాశమున కెగురుట యందలి ఉద్దేశ్యము. మలయవతి భక్తికిని, జీమూతవాహనుని స్వార్థ త్యాగమునకును మెచ్చి, వెంటనే గౌరీదేవి ప్రత్యక్షమై, జీమూతవాహనుని బ్రతికించును.

గౌరీదేవి, జీమూతవాహనునికి విద్యాధర చక్రవర్తి యను బిరుదు నొసగి, అతని రాజ్యము తిరిగి అతనికి వచ్చునట్లు చేయును. అదేసమయమున దేవలోకము నుండి అమృతవర్షము కురియును. ఈ విధముగా కథ ముగియును.

ఇంతకుముందు చెప్పినట్లు, ఈ నాటకము కూర్పు చాల శిథిల మైనది. దీనిని ప్రదర్శించుట కూడ కష్టసాధ్యము. మిగిలిన రెండు నాటికల వలె, ఇది మనోరంజకము కాదు. హర్షుడు తాను

బౌద్ధమతమును స్వీకరించిన తర్వాతనే, ఈ నాటకమును రచించి నట్లు గన్పట్టుచున్నది.

హర్షుని మూడు రూపకములలోను చాల విషయములు పున రుక్తములుగ తోచును. మూడు నాటకములును హర్షుడే రచించి నట్లు ఆధారము లున్నను పలు విషయములు చిత్రించుటలో కవికి తగిన సామర్థ్యమున్నట్లు కనిపించదు. లేక అతడు నిర్లక్ష్యముగా వ్రాసియుండవచ్చును.

'రత్నావళి' లోని ఈ క్రింది వాక్యములు నాగానంద ప్రియ దర్శికలలో కూడ, అట్లే యున్నవి.

సఖే, అతోఽపి సంతాపోఽధిక తరం మాం బాధతే
భో వయస్య ప్రచ్ఛాదయ అనేన కదళి పత్రేణ ఇమాం
చిత్ర గతాం కన్యకాం
అయే కథ మనభ్రా వృష్టిః
కథం ప్రత్యభిజ్ఞాత్మాస్మ్యనేన
హతాశ అనుభవ తావదాత్మనో వినయస్య ఫలమ్.

హర్షుని నాటకములలో భాసుని పోకడలు కొన్ని గలవు. కథా నాయకుడు వివాహితుడైనను, మరియొక సుందరిని ప్రేమించును. ఆ సుందరి యుక్తిచే, రాజ భవనమున ప్రవేశ పెట్టబడి, ఆమెను సమీపించుటకు రాజునకు తగిన అవకాశము లభించగనే మహారాణిచే, అతడు పట్టుబడును. కాని చివరకు కథ సుఖముగనే అంతమగును.

పాత్ర పోషణములోను, కథాక్రమములో హర్షుడు, కాళిదాస భవ భూతులకు తీసికట్టే.

ఇదంతయు హర్షుని నాటకములకు సంబంధించిన విషయము.

సుప్రభాత స్తోత్రమే గాక, హర్షుడు, అష్ట మహా శ్రీ చైత్య సంస్కృత స్తోత్రము గూడ రచియించెను. రెండవది, ఎనిమిది

సుప్రసిద్ధ బౌద్ధ చైత్యులను వర్ణించు పద్య కావ్యము దీని ఉనికి మనకు చీనీ పాఠాంతరముల వలన తెలియవచ్చుట విచిత్రముగ కనపడును. హర్షుడు దీనిని 'శిలాదిత్య కృతి' యని సూచించెను. బంస్ఖేరా, మధువన్ ఫలకములందలి శాసనములు కూడ హర్షుడు స్వంతముగా వ్రాసినవే. ఈ శాసనము లందలి రచనా శైలి హర్షుని నాటకములందలి రచనా శైలిని పోలియుండును.

## VII

## హర్షుని మరణము - తదనంతరము

యువాన్ చ్వాంగ్ మన దేశము నుండి తిరిగి వెళ్ళిన వెను వెంటనే హర్షుడు మరణించెను. అతడెట్లు, ఎక్కడ మరణించెనో ఈ వివరములు పూర్తిగ తెలియవు. ఏ సంవత్సరములో ఏ రోజున అతడు మరణించెనన్నది కూడ వివాదాంశమే. 'యువాన్ హ్వా' యుగాంతమున శిలాదిత్యుడు మరణించెనని మాత్రమే యువాన్ చ్వాంగ్ జీవిత గాథలో వ్రాయబడియున్నది. దీనిని బట్టి హర్షుడు 7 వ శతాబ్దపు మధ్యభాగములో మరణించెనని ఊహించవచ్చును. చైనాదేశపు చక్రవర్తి హర్షుని ఆస్థానమునకు ఒక ప్రత్యేక రాయబారిని కూడ పంపెనని అందు తెలుపబడినది. ఆ రాయబారి పేరు 'వాంగ్ హ్యూన్ సే' ఈ దేశములో నలుదిశల వెదజల్లిన న్యాయ, ధర్మ సిద్ధాంతముల కొక సంరక్షకుడు, ప్రతి నిధి యుండవలెనని తలచి అతనిని పంపిరి. ఆ రాయబారి క్రీ.శ. 648 లో, అనగా హర్షుడు మరణించిన తరువాతనే వచ్చినటు లగుపడుచున్నది.

ఈ విధముగ హర్షుడు రమారమి ఒక అర్ధ శతాబ్దము వరకు (605 నుండి 647 వరకు) పరిపాలించెను. స్థానేశ్వరము వంటి చిన్న రాజ్యము యొక్క భారమును వహించుటకు కూడ తగిన వయస్సు రాకపూర్వమే, 14 వ ఏటనే అతడు పరిపాలనకు పూనుకొనెను. అయినను రాజ్యభారమును కడు సమర్థతతో నిర్వ హించి, వయస్సుకు మించిన శక్తిని ప్రదర్శించెను. అనేక దండ యాత్రలు సలిపి దుష్ట శిక్షణ శిష్టరక్షణ గావించెను. ఒక విశాల సామ్రాజ్యమును స్థాపించి మిక్కిలి కీర్తి గడించెను. అంతటి సామ్రాజ్యము మన దేశములో అశోకుని కాలములోను, మొగ

లాయిల కాలములోను, తప్ప మరెప్పుడును లేదనియే చెప్ప వచ్చును. హర్షుడు దయార్ద్ర హృదయుడు. రేయింబవళ్ళు పీదల బాధలను తొలిగించుటకు పాటుపడుచు దేశ పురోభివృద్ధికి నిర్వి రామముగ కృషి చేసెను. ఇంతియేగాక మనమింతకు ముందు గమనించినట్లు అతడొక గొప్ప పండితుడు. అనేక నాటకములను, కావ్యములను రచించి నాటకకర్తగా, కవిగా ఖ్యాతి నొందెను.

అంతటి మహా పురుషుని మరణము ఏ దేశమునకైనను, నొక తీరనిలోటు కాగలదు. హర్షుని మరణానంతరము దేశమంతట అరాజక శక్తులు ప్రబలి తిరుగుబాటులు చెలరేగినవి. యువాన్ చ్వాంగ్‌కు కలలో నొక స్వర్ణమూర్తి ప్రత్యక్షమై ఈ విధముగ పలికెనని చెప్పెదరు. "శిలాదిత్యుడు మరణించిన పది సంవత్సర ముల తరువాత భారతదేశములో కల్లోల పరిస్థితు లేర్పడును. దుష్టశక్తులు ప్రబలి ఒకరి నొకరు చంపుకొందురు. ఈ నా మాటలు గుర్తుంచుకొనుము." (యువాన్ చ్వాంగ్ జీవిత గాథ నుండి.)

హర్షుని మరణానంతరము అమాత్యుడొకడు సింహాసనమును అనధికారముగ నాక్రమించుకొనెను. హర్షునికి కొమరులుండిరో లేదో మనకు తెలియదు; కాని అతనికొక కొమర్తె కలదని, ఆమెను వల్లభిరాజగు ధృవభట్టునకిచ్చి వివాహము చేసెనని తెలియు చున్నది. అమాత్యుడు చైనా రాయబారి పై దాడిసలిపి అతని అనుచరులను చంపివేసెను. కాని రాయబారి ఎటులనో తప్పించు కొని పారిపోయెనట. హర్షుని ముఖ్య స్నేహితుడు, అసామ్‌రాజు, ఎదురు తిరిగి కన్యాకుబ్జముతో సంబంధము త్రెంచుకుని, వంగ దేశము చుట్టునున్న హర్ష సామ్రాజ్యములోని కొంత భాగమును తన రాజ్యములో కలిపికొనెను. తరువాత, మగధలోని గుప్త వంశీయులు కూడ కన్యాకుబ్జమును ధిక్కరించి స్వతంత్రులైరి. ఈ విధముగ, అసమాన ధైర్యసాహసములతో స్థాపింపబడిన హర్ష సామ్రాజ్యము నొక్కసారిగ విచ్ఛిన్నమయ్యెను.

# గ్రంథ సూచిక


1. ఆల్టేకర్, ఎ. ఎస్.: ప్రాచీన భారతదేశములో విద్యా విధానము.
2. బాక్‌కున్ బాయ్ : శ్రీ హర్షుని నాటకములు.
3. బియల్ : ప్రాచ్య దేశపు బౌద్ధ వ్రాత ప్రతులు
4. ఎమ్. ఎల్. ఎట్టింగ్‌హౌసన్ : హర్షవర్ధనుడు
5. రాయల్ ఏసియాటిక్ సొసైటీ, బొంబాయి శాఖ : పత్రికలు
6. ఏసియాటిక్ సొసైటీ, బెంగాల్ : పత్రికలు
7. కాలే, ఎమ్. ఆర్. : శ్రీ హర్షదేవుని రత్నావళి
8. కానే, పి. వి. : బాణభట్టుని హర్ష చరితము
9. మహాజన్, వి. డి. : ప్రాచీన భారతదేశము
10. ముఖర్జీ - ఆర్. కె. : హర్షుడు
11. పణిక్కర్ కె. ఎమ్.: కనౌజ్ శ్రీ హర్షుడు
12. స్మిత్, వి. ఎ. : భారతదేశ ప్రారంభిక చరిత్ర
13. వాటర్స్ : యువాన్ చ్వాంగ్ యాత్రలు.


---


**Printed at Raj Printing Company, New Delhi-110020.**